# ప్రకటన.

నా లిఖితరూపమైన యనుజ్ఞ లేక యెవరును ముద్రింపఁ గూడదు. అట్లు చేసిన నానష్టమునకు పాత్రులగుదురు.

ఇట్లు,

గ్రంథకర్త.

శ్రీరామా.

# వజ్రనాభవధ

లేక

# ప్రభావతీప్రద్యుమ్నము.

గ్రంథకర్త.

కాటిపురి నరసరామయ్యగారు.

మొదటికూర్పు

PRINTED AT THE VICTORIA JUBILEE PRESS,
CHITTOOR.

 1925 [*Price 1—0—0.*

# అంకితము.

భూమా స్తనకుంకుమంబరిణమున్ • శ్రీవత్సము
నాభిజలన్

వైభోగంబున భోగిభోగమణులన్ • వైరంబె
శోభించుచున్

వైభూత్యర్థము దాధరారమణినిన్ • వైరంబ
లాలించుచున్॥

రాభోగంబులఁ బొందు కృష్ణునకున • ద్రామా
మణీభోగికిన్॥

సీ॥ సలిలోద్భవంబును • సలిలోద్భవంబును
మేతయుఁ గయ్యునై • మేలమాడ
సరసిజాహితుఁడును • సరసిజాహితుఁడును
వలకన్ను డాకన్ను • వరుసఁ గాఁగ
కంధిజన్మంబును • కంధిజన్మంబును
గుండ్రంబు నాదంబు • గొలువు సేయ
పులుఁగుల ఱేఁడును • పులుఁగుల ఱేఁడును
గుఱ్ఱంబు పాన్పునై • కొమరు నెఱపు

ఆ॥ వె॥ భువనభర్త విష్ణు • భూమాధవునకును
నళిజజనకునకును • నాథునకును
అధికభక్తితోడ • నంకితమొనరింతు
కొడుకుచరితము జన • కునకు నమః!
భాగ్యమన్న నిదియ • భాగ్యంబు భాగ్యంబు
తలఁచి చేయుకలదె • ధాత్రియందు॥

# విజ్ఞప్తి

ఉ॥ సత్కవినాథులందఱిని ♦ సంతసమొప్ప భజించి డెందమున్
మత్కులదైవముం దలఁచి ♦ మజ్జననీమణి సంస్మరించియున్
సత్కథనాటకంబుగను ♦ సారసశైలిని పూనివ్రాసితిన్
తత్కథఁ దప్పులన్విడిచి ♦ శ్రద్ధయునొప్పులకై కొనుండిలన్॥

సీ॥ ఏమహామహానీయుఁ ♦ డెల్లకాలములందు
కనుఱెప్పలంబోలి ♦ కాఁచుచుండు
ఏమహామహానీయుఁ ♦ డెలమినజ్ఞానము
నడుగంటఁద్రొక్కిడి ♦ పుడమివేల్పు
ఏమహామహానీయుఁ ♦ డెల్లవేళలయందు
నెరసుల సరిదిద్దు ♦ సరసగుణుఁడు
ఏమహామహానీయుఁ ♦ డింపారనాటక
రంగంబురచియించి ♦ ఘనుఁడనరె

తే॥ గీ॥ అట్టిమద్గురుకుంజరుఁ ♦ డైనసరిన
రమ్యగుణగేయుఁడైనశ్రీ ♦ రామశాస్త్రి
భక్తిగొల్తును నిరతంబుఁ ♦ బ్రాజ్ఞులార!
భావ్యమూకాదివిదియును ♦ బాలకులకు

తే. గీ॥ మద్గురువరపదాంబుజ ♦ మూలహృదయ
పాటలోజ్వలపీఠంబు ♦ నమూనుంచి

భక్తికుసుమంబుఁ బూజించి ♦ ప్రీతుఁజేసి
వ్రాసితిని నాటకంబును ♦ ప్రాజ్ఞులార!

ఆంధ్రసోదరులారా!

నన్నీ నాటకంబును వ్రాయఁ బ్రోత్సాహపరచి పీఠికను సయితము వ్రాసియిచ్చిన మద్గురువరేణ్యులును బ్రహ్మణ్యులును చిత్తూరురాజకీయోన్నతపాఠశాలా ప్రధానాంధ్రోపాధ్యాయులును యగు బ్రహ్మశ్రీ గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారికి వందన పరశ్శతంబులు.

ప్రభావతీ ప్రద్యుమ్న మను నీగ్రంథమును తొలుదొల్త రాఘవపాండవీయ కళాపూర్ణోదయాది బహుకావ్యరచనాదురంధరుండును సూరికులావతంసుండును యగు పింగళి సూరనార్యుఁడు రచియించెను. భాగ్యవశంబున కొలఁదిమాసములకుమున్నే నా గ్రంథముఁజదువ తటస్థించినది. నాఁడే యద్దాని నాటకంబుగ రచియించి భగవదర్పణంబుఁగావించి యాంధ్రలోకంబున నెలకొల్పనెంచి యేదేనొకవిధంబున నామనోగతంబును బూర్తిఁజేసితిని. అందెట్టిదోసఁగులు పొసఁగినను యయ్యవి నావియనియు నొప్పులు సూరనార్యునివనియు గ్రహింపవేఁడుకొనుచున్నాఁడను. ఇన్నాటకంబున చిహ్నబిందువులు గల పద్యములన్నియు మూలనుండియే కొనఁబడియున్నది. ఇందులకు వావిళ్ళవారికి నేనెంతయు కృతజ్ఞుఁడను.

నాటకమున సందర్భానుసారముగ రమ్యతర గీతములను వ్రాసియిచ్చిన నామిత్రులగు శ్రీ. డి. వెంకటరమణప్పగారికి

కృతజ్ఞతాపూర్వక వందనములు. అప్పుడప్పుడు తగిన సలహా నిచ్చుచుండిన మన్మిత్రులగు దూబగుంట సుబ్బరాఘురావుగారికిని కృతజ్ఞతాపూర్వక వందనములు. తగుకాలంబునకు నీగ్రంథంబును నాకందజేసిన శ్రీ విక్టోరియా జూబ్లీ ముద్రాక్షరశాలాధికారులకు నా విశ్వాసమును వెలిబుచ్చుచున్నాను.

ఇదియే నా ప్రథమప్రయత్నము. నాప్రయత్నము "హనుమంతు నెదుట కుప్పిగంతులను" చందంబున పరిణమిల్లునని దెలిసియుఁ బూనుకొంటిని. నీరక్షీరవిభాగ నైపుణీదేలు మానసౌకంబులఁబోలె నొప్పులుమాత్రముఁ గైకొని తప్పులవిడనాడ ప్రార్థితుఁడను.

ఇట్లు సుధీజనవిధేయుఁడు,

కా॥ నరసరామయ్య.

**12—2—1925.**





శ్రీ

# ప్రభావతీ ప్రద్యుమ్నము.



[నాంది]

శా॥ శ్రీరాముండు జనావనుండు సుమనో ♦ సేవ్యుండు సౌమ్యుండుదా
కారుణ్యాంబుధిచంద్రుఁడీశుఁడురమా ♦ కాంతాంకభాగ్యుండు శ్రీ
శ్రీరాంభోనిలయుండు దేవనుతుఁడ ♦ క్షీణుండు స్వారాజ్యముల్
వేరక్షించిన కృష్ణుఁడో ముతమిముల్ ♦ వేగంబె నశ్రాంతముల్ ॥

ఉ॥ దాగుడుమూఁతలాసిగిరి ♦ దాలిచి మన్ననలాగఁజేసివే
వేగ మెలిచ్చి మెత్తికడు ♦ వీరతగోరులకూళుఁజంపియున్
దాగిన రాచమూకలను ♦ ధ్వంసము సేసియు రాజమిన్నయై
భోగముపొంది వాదముల ♦ బోధలఁజేసిన వెన్నుఁడోముతన్॥

[అనుబంధము 1.]

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి పుష్పాంజలిఁ జల్లి తెరవంకఁజూచి]

సూ:—కాలయాపనంబెందులకు? బావా! యిటురమ్ము.

[మారిషుఁడరుదెంచి] కాలయాపన మేమియులేదు. కాని మార్గమధ్యంబున ———

సూ:—ఏమి! ఏమి! భూతమేదైన నిన్నావరించెనా!

మా:—బావా! నిజమే. కన్యాభూతంబాంసు.

సూ:—అయినచో నిది చక్కని నాటకమగును. నేటి రాత్రి దీనిని ప్రయోగించినచో నిదివరకే పెక్కునాటక రాజములం గాంచిన సరసజ్ఞులగు యీసభాసదుల హృదయరంజకముగానుండును. సోదము తగుసూచనఁజేసితివి.

మా:—నాచరిత్రమే చిక్కనిదా? వేఱద్దియులేదా? నాకనవమానముగనున్నది నేనురాను బావా!

సూ:—[యోచించి] ఆ! తెలిసినది. మున్నుసీవలె ప్రభావతీ భూతచేతనుక్కంఠైన ప్రద్యుమ్నుండున్నాఁడు. అతని చరితము నాడెదము.

మా:—బావా! అద్దాని రచియించిన కవియెవ్వఁడో కదా!

సూ:—* ఆ॥ వె॥ గంగతనదుపేర • గౌతమీనామవి
ఖ్యాతిఁబరఁగఁదెచ్చె • భూతలమున
కేమహానుభావుఁ • డామునిసింహుఁడు
గౌతముఁడుతపోధి • కతఁడలిర్చు॥

కలఁడుకదా! గౌతమగోత్రపవిత్రుండును "నిఖిలసూరిలోకాంగీకార తరంగిత కవిత్వ వైభవ పింగళి యమరనార్య తనూభవ సౌజన్యజేయసూరయనామధేయుఁడు.

మా:—అతఁడా! కళాపూర్ణోదయాది పెక్కుగ్రంథముల రచించిన కవికుల తిలకుఁడు. [ఆలోచించి] అమ్మహాకవి రచి

యించినవన్నియు కావ్యములేకదా? ప్రభావతీ ప్రద్యుమ్నమను సీమహాకావ్యమును నాటకముగ వ్రాసిన వారెవ్వరు?

సూ:—మున్నే తెలిసియుందును.

తే॥ గీ॥ సరసకవితాధురీణుఁడు • సాధువంశ
క్షీరనీరాకరామృత • కిరణయుతుఁడు
సజ్జనవిధేయుఁ డరయంగ • శాంతిమయుఁడు
రామనామంబుఁబరగంగ • రంజితుండు ॥

మ:—ఇప్పటికే కాలము మీరినది. పోదమురమ్ము

[నిష్క్రమణము—ఇది ప్రస్తావన]



# శ్రీ ప్రభావతీ ప్రద్యుమ్నము.

[ప్రథమాంకము.]

[ప్రథమరంగము-ద్వారకాపురి వెలిప్రదేశము]

[ప్రవేశము—యింద్రుఁడు—మాతలి]

ఇం:—మాతలీ! కనుఁగొంటివా! మాకన్నుల కట్టెదుటఁ గానఁబడు ద్వారవతియందము.

సీ॥ * ధాత్రీమహాదేవి • తాల్చినమున్నీటి
మొలనూలిరత్నంపు • మొగపంగ
జలధిపేరిటిపాప • తలచుట్టుగలధర
త్రిమూర్తిశిరచిత్ర • తిలకమనఁగ
అపరదిక్సతికట్టె • నట్టిసాగరమును
పుట్టంబుతుదిప్రాంత • మొగడయనఁగ
వరుణగోపురబద్ధ • వార్ధితోరణమధ్య
గుంభితనవపుష్ప • గుచ్ఛమనఁగ
తే॥ గీ॥ వివిధమణిమయగృహదీప్తి • విసరవిసర
ణోపశోభితమగుద్వార • కాపురంబు
దవులఁగానిపించుఁదనుఁజూడ • దలఁపువలచు
వేయికన్నులుజాలవు • వెఱిగిదేమి!

[ అనుబంధము 2. ]

మా:—ఆయుష్మంతుఁడా! ఈ సౌందర్యం బేటికేనియు వెలుపుఁ గొలుపు [నడుచుచు]

ద్విపద॥ గగనమునంటెడి - ఘటితాగ్రహాములు
నిగనిగలాడెడి - నీలఁపురాసి
అందములొల్కెడి - యువనీరుహాములు
సుందరి కామిని . చూష్కలుజాల
రతనాలసొంపుల - రాజిలువీధి
సంతసమొప్పెడి - సరసులప్రోలు
చల్లఁగవీఁచెడి . చలికరువంబు
మెల్లఁగకదులుచు - మించెను చెట్లు
చందురుకేరెడి - చతురులముఖము
చందముచూడఁగ - సంతసమౌను
లతలనుబోలెడి - లాలితకరము
వెతలనుఁబొందని - వేడుకమనము
బంగరుకుండల - భంగముసేయు
రంగగుకుచముల . రాగముఁదనరు
గగనముబోలెడి - కాంతలకౌను
వగలనుకఱపెడి . వారలనడక
అల్లనిసొంపులు - అతివలపాట
ఝల్లునవినఁబడు - బహుళస్వనములు
వీధులతిరిగెడు - వెలయాల్గములు
సాధులకూటము - సరవినిమళియు

వింపులుగొల్పెడి - వీణారవములు
అందముగొల్పెడి - ఆటలసొంపు
మనమునకింపగు - మానితబుతము
ఘనమగువాసన - కస్తురికణము
వింతలనించెడి - విహంగారవముల
వంతలనడచెడి - వర్ణధ్వజములు
అనయము వెలిగెడి - అధ్వరానలము
వినయముచూపెడి- విప్రాన్వయములు
ముద్దులగుల్కెడి - మురళీనినదము
సుద్దులబల్కెడి - శుకపికచయము
నాకముజూడగ - సమ్మదమనము
నాకనువొప్పగ - నాట్యముగనుము
సంయమిజూడగ - సరసునగొనము
సంయమినెలవుల - సరసతగాంచు

ఆయుష్మంతుడా! ఇదియే ముకుంద మందిరము. అదిగో! సాత్యకి బలరాములు మనయెదుర్కొలుపను వేచియున్నారు.

ఇంద్రుడు:—వేగిరంబ పదుపుము.

[నడుచుచున్నారు—పరదాజారును]





[ ద్వితీయరంగము — శ్రీకృష్ణుని మందిరము ]

[ప్రవేశము - ఇంద్రుఁడు - మాతలి] (అనుబంధము 3.)

ఇం:—విజయోస్తు. విజయోస్తు.

కృ:—పురందరా! మీకందరికిని భద్రమేకదా? ఇంత దూరంబు రాకారణంబెయ్యదియో?

ఇం:—హే! సందమునందా! దెలియనివానిఁ బోలె మమ్ములఁ గాతించుట న్యాయమా? నీ నెఱుంగనిదొక్క టి భువనత్రయంబులనైనఁ గలదే! వినవలఁతువేని విన్నవించెదను. దేవా! వజ్రనాభుండనువాఁడు విరించిని గుఱించి దీర్ఘతపంబాచరించి యతనినిఁ బ్రసన్నుంజేసి యనేకవరంబుల నొంది తన్మహత్వంబున మేరుగిరిపొంత పోతుటీగ కైనను చొరరాని నొక్క-నగరంబునిర్మించుకొని యున్నవాఁడు.

హే! కృష్ణ! వానిపోతరమేమని చెప్పుదును. ఒక్కతరి మదాంధత దాడినేగుదెంచి చేసిన యకార్యముల నేమని చెప్పనగును.

సీ॥ * దనుజాదిరోహతా ♦ డనభంజనాదుల
కోర్చునేకల్పవృ ♦ క్షోత్తమములు
శోష్యపర్యుషితమ ♦ నుష్యమాసంబులు

పూనునట్టిగియెసం ♦ తానకములు
దానవద్వసఘటా ♦ లాని తాదురవస్థ
సై రించు నేహరి ♦ చందనములు
మనుజఖాదిస్వేద ♦ మలినవస్త్రాదులు
తాల్పఁబాలివియెమం ♦ దారతరులు
తే॥ గీ॥ నందనమ్మునకునువజ్ర ♦ నాథ దైత్యుఁ
డవుఁడుచేసిన కష్టపా ♦ టబ్జనాథ!
యిపుడుఁదల,పునఁబాఱిన ♦ హృదయమునకు
నధికతరమైన పరితాప ♦ మావహిల్లు.

అట్టివానినెల్లో శాంతవచనంబుల కోపాటోపశమనంబుఁ గావించి వానిసేనల కనూనంబుగా విడుదలు సాలుబెట్టించి అనుగులకు మనుగులొత్తు ప్రాప్తి నాకు దప్పదయ్యె.

తే॥ గీ॥ * పంకరుహనాథ! ఏపద్ద ♦ పాటులరయ
నెందునెవ్వరు బడరునీ ♦ కేమిచెప్ప
ఎంతపాపంబుచేసిన ♦ జంతువైనఁ
యింద్రుఁడగునని యపుడాత్మ ♦ నెన్నుకొంటి

మఱొక్కసమయంబున దనుజానీకంబు పరివేష్టింప వచ్చి యెన్నియుపచారంబులఁ గావించినను యించుకైనను కరుణంబూనక

మత్తకోకిల॥ * ఎంతకాలమునీవునాకము నేలి తిచ్చటినుండినా
కంతకాలము నేలఁబాడిబిడౌజ కశ్యపమానిరా
ట్నంతతిత్వము మీకుదానవజాతికి న్సరికాదనీ

వింతయుంగని రాజ్యహీనతనేఁగు మెచ్చుటికేని
యుఁ.

అనిమషవగా చేయునదిలేక నీశరణుఁజొచ్చితి. జగ
న్నాయకా! నన్ను మెడబట్టిత్రోసినను నేనవ్వలికిజనను.

అచ్యుతా! త్వమేవశరణం. త్వమేవశరణం.

కృ:— పురందరా! యెంతటిమాట వినఁగలిగె. సర్వ
మునాకు విదితము భయంబుడుగుము. అమరనాయకా!
మున్నిట్లెందరు రక్కసులు కన్నుమిన్నుగానక సాధులకాతించి
తుదకంతమొందలేదు. వీడునట్లులేని జనాశకాలంబు డాయం
జేసి,యిట్టులుత్రుళ్ళుచున్నాడు. సత్పురుషుల చిత్తము నొప్పిం
చిన వృధాకాదుసుమా! అయిన కొంతకాలము యోపిక
నుండుము.

మ॥ * వసుదేవుండిపుడధ్వరంబొకటిని ♦ ర్వర్తింపనుద్యుక్తమా
నసుఁడైనాఁడదియుఁ ద్వదర్థమేకద ♦ నాకేశ! ఆకార్యమె
ప్డుసమాప్తంబగు నంతనుండియువర ♦ ప్రోల్లాసినాదుష్టరా
క్షసుసాధించుటకు బ్రయత్నముదగం ♦ గావింతుమేకాగ్ర
తఁ.

పురందరా! నీవును నిజవాసంబునకరిగి తత్పురిఁ జొరశ
ఖ్యంబగు కార్యంబుఁ గావింపుము.

[ద్వితీయరంగము సమాప్తము.]

[తృతీయరంగము—యజ్ఞశాల.]

[భద్రుఁడు ప్రవేశించినాట్యము సలుపును.]

[అనుబంధము 4, 5.]

వటుట:— ఓరీ భద్రా! చాలు చాలు నీనాట్యప్రావీణ్యము. కడునలసియున్నావు. ఇవిగో! మాపైచీరలఁ బొగుడుము. [పైచీరల విసిరివైతురు.]

భ:— ఓహోహో [అని కేక పెట్టుచు నాట్యము సలుపును.]

[అనుబంధము 6.]

సీ॥ * వేదసౌరభముల ♦ వెదజల్లఁగలశుచి
బ్రాహ్మణజాతికో ♦ రకములార!
పరిశుద్ధిపెంపొందు ♦ బ్రహ్మవర్చసు పావ
కన్యార్జితస్ఫులిం ♦ గంబులార!
అరయనట్టికసీల ♦ లంతలయ్యనుబింక
మున బ్రహ్మశిఖముట్టు ♦ పోఁడలార!
దంటమాటలకుధా ♦ ర్త్యమునకునానతి
పడిపట్టినట్టిస ♦ తాఁజ్ఞలార!
ఆ॥ చిన్నవడుగులార! ♦ వెన్నునివామన
త్వంబునభినయించు ♦ తంత్రురార!
విప్రప్రసాదమిదిస ♦ మృద్ధికారణముమా
కఖిలకార్యముల ♦ మహాత్ములార!

వ:— ఓరీ యాటకాడా! ఈ అఱాపులా పొగడ్తలు? ఇవియేటికి బ్రియము. చాలు చాలు మీరంటనగోఁచుల పుచ్చకొనకఁ జనుఁడు.

భ:-[తోడివారినిజూచి] ఓరీ జాగ్రతసుమా! యీగోఁచి పాపలాభరణంబుల నపహరించుట కిటునటు తిరుగుచున్నారు.

వ:— ఓరీ! ఏమిరా! నీపొగరు. కండకావరమా? [కోపముతో] ముచ్చదనాలకు మీకు పుట్టినిండ్లైయుండ మేము ముచ్చులమా? నాట్యవేషంబున నే పురినైనను యత్ర మంబుగఁజొచ్చి పగలంతయునాట్యములాడి జనులకంట మట్టిఁ గొట్టి రాత్రులయందవ లీలగదొంగలించుట మీపనిగదా?

కృ:— [ఆత్మగతముగ] ఆహా! వీరివాక్యముల మోఘం బులు. ఇవినాకెంత యోసాయవృచుచున్నవి. నాట్యవేషంబున వజ్రపురిఁ జొరనగును. దీనికిఁ జాలినవాడెవ్వఁడు. [వడుగులం జూచి] అయ్యా! చాలును మీకలహంబులు. అధ్వరంబును సమాప్తంబయ్యె. ఇఁక మన మన నిజనివాసంబుల కేగుదము.

[తృతీయరంగము సమాప్తము.]





# ప్రభావతీ ప్రద్యుమ్నము.



[తురీయరంగము—అమరావతీనగరము.]

[ఇంద్రుఁడు దేవదూతలతో యోచించుట.]

ఇంద్రుఁడు:—తే॥గీ॥ * హంసవరులార! మాకొక్క • అవసరంబు
గలిగి పిలిపించితిమి మీరు • కలుగుటకును
ఫలము మీచేతనైనయీ • పనికొదువుట
కావునవి నుండు వివరింతు • కార్యసరణి

క॥ * మమువజ్రనాభుఁడనియెడు
నమరరిపుఁడు పఱచినట్టి • యాపాట్లనుసమ
స్తము మీరెఱుగుదు రేకద
క్రమముననవి చెప్పనేల • ఖగచరులారా!

వానిఁ దుదముట్టింప తలంపుమాకు జనించియున్నది. మాకంటెను వాఁడు మున్నె మెట్టిమాయోపాయంబులఁ బన్ను నో కాన మీరువాని నగరనరిసర సారసాకరంబుల మీహంసరూపంబులఁ జరించి జరుగు వింతలను మాకెఱింగించునది.

శుచీముఖపల్లిభుఁడు (లేచి):— దేవా! అదుష్టుఁడు గర్వాంధమునకన్నుగానకున్నవాఁడు. ఈవంకకురాఁడని దోఁచుచున్నది. అయినను మన మహామాత్రతోనుండుట శ్రేయోదాయకంబు ఏమనుకొందఱ మిప్పుడే వజ్రపురియుండి వచ్చినారము. అప్పట్టికాతిశయంబును శుచిముఖ విన్నవించుగాక.

శుచిముఖ:— దేవా! దేవనాథా! ఏమప్పుడప్పుడ తని రాజ్యమునకు విహంగరూపంబులఁ బోవుచుందుము పోక మానుదు మందుమావలనుగాకున్నది. ఏలన.

సీ॥ * గగనస్రవంతిలోఁ ♦ గల స్వర్ణాబ్జంబు
లందుమేలేర్చితా ♦ నపహరించి
మానసంబుకేఁగాత్మ ♦ మానసంబునుబోలె
నిస్సారసత్వంబు ♦ నెరయఁజేసి
బిందుసరంబులోఁ ♦ గుందనపుదమ్మి
వేరులేకుండగ ♦ పెల్లగించి
సౌగంధికాఖ్యకా ♦ సారంబుజలమాత్ర
శేషమైదీనతఁ ♦ జెందఁజేసి

తే॥ మఱియుఁ గల దివ్యసరసులు ♦ నెఱయఁజెఱిచి
తనదుకేలిదీర్ఘికలందుఁ ♦ గనకనలిన
జాతులెల్లనాటించినా ♦ డాతఁడింద్ర
అటచనకమాకునుండంగ ♦ నౌన దలఁప.

అదట్లులుండనిండు. మేమాకాసారంబుల వినోదార్థము సంచరించు నొక్కనాఁడు కన్యాంతఃపుర పరిసరంబు నొక్క

కమలాకరంబున కేఁగి వినోదించుచుండ కన్యాలలామంబొకఁడు నిందు జవ్వనంబునలతామందిరంబున కూర్చుండి యొంటి మై తన చెలితో "చెలీ! నేఁడొక్క కలకంటి. అయ్యది కమంగను యద్భుతంబు. అయ్యది లోకంబున మునుకన్నది విన్నది కాదు. మఱియు.........అని యూరకుండ "అక్కా! ఎట్టి రహస్యంబులనైనను నాకుఁ జెప్పక మాననంటివి కదా? " యెందులకు మఱుగుబెట్టదవే" యన

చ॥ * హిమగిరిరాజకన్యపర ♦ మేశ్వరి నాకలసుప్రసన్నమై
విమలదరస్మితామృతము ♦ వెల్లువచెక్కులఁబిక్కటిల్లనఁ
మమతనుఁజేరఁగాబిలిచి ♦ మక్కువచేసను నొక్క కేలమే
నిమురుచునీకు నొక్క వరు ♦ నిఁ ఘటించితినంచు
పల్కుచుఁ॥

సీ॥ * సంకల్పమాత్రత ♦ క్షణసన్నిధాపితం
బగుచిత్రఫలకంబు ♦ నందునొక్క
పురుషునత్యాశ్చర్య ♦ తరరూపలావణ్య
గాంభీర్యశౌర్యాది ♦ శుంభదఖిల
గుణముఁగొమరందు ♦ కొమరుబ్రాయువువాని
వ్రాసియితండనీ ♦ వల్లభుండు
ప్రద్యుమ్నుఁడనియొకు ♦ ప్రభుకుమారుఁడు మీకు
నిద్దఱకును జని ♦ యించినట్టి

తే॥ పుత్రుఁడీపురినేలునో ♦ పొలఁతియనుచు
బలికెనటనేను నచటిపి ♦ ద్దలుగఱపంగ

మొ్రక్కయనిపితినఁటయిందు ♦ నిక్కమనుచు
బడఁతియున్నది తచ్చిత్ర ♦ ఫలకమిపుడు॥

అమరాధీశా! నే నావాక్కులాలించి వజ్రనాభునకు కాలంబు దాపించినదని యెంచితిని. ఎట్లన

మఱొక్కటి:—(నిలువంబడి) నిశ్చయము. పార్వతి మాటలెన్నటికిని యనృతములు కానేరవు. కాకపోయిన వజ్రనాభుఁ డిష్టపడి వైరికి పుత్రికనివ్వఁడు. ప్రద్యుమ్నుఁడు భర్తయైన పోరుదప్పదు. దప్పనిచో జయముపొసఁగదు. ఇది సత్యము. నిజము. నృతము.

శుచి:—సురాధీశా! మఱికొన్ని విశేషంబులను విన్న వించెద సావధానమనస్కుండవై యాలకింపుము. ప్రభావతిం గాంచి చెలి " వనితా! నీవెంత భాగ్యవతివే అచ్చిత్రఫలక మిటదెమ్ము. చూచుదాక మనోశాంతి గలుగదు." అంత వారలా ఫలకంబునుదీసి

చ॥ * కలకలనవ్వినట్లుతెలి ♦ కన్నుల నిక్కముచూచి నట్లుతో
బలుకఁగడంగినట్లు కడు ♦ భావగభీరత లబ్బినట్టు పెం
పొలయఁదనర్చి జీవకళ ♦ యుట్టిపడఁగ శివవ్రాసినట్టి యా
చెలువునకాభిముఖ్యముభ ♦ జింపదలంకెనుదానుబోఁటి
యుగ

ఉ॥ *చిత్తరువన్న నిశ్చయము♦చేనెదురుండి మొగంబుచూడమో
మెత్తునుసత్యపుంభ్రమన ♦ మ్మద్ధిని గ్రమ్మఁదక్షణంబు
లో

నొత్తుచుఁదత్తఱంబు ద్రపయుఁ ♦ మగుడంగనిరీక్షణేచ్ఛఁ
బో

మొత్తునుభర్తమోమునుద ను♦మోచుటదోఁచిన నోసరిల్లుచుఁ

దానికాశ్చర్యమగ్నయై సఖి చెలీ! ఇంతటి సుకుమార గాత్రుండు, సౌందర్యవంతుఁడు భువినొక్కఁడుండునో? పార్వతీదేవి తనమాహాత్మ్యంబున నిట్టులు వ్రాసియుండును. అంబు జగర్భుండును దానికిఁదోఁడు నిన్ను సృజించెఁగాబోలు అని నానావిధ మృదుమధుర ప్రసంగంబులాచరించుచుఁ గొంతతడ వుండిరి. ఏమఱలివచ్చితిని.

ఇంద్రుఁడు:—

సీ॥ * శబ్దసంస్కారమె ♦ చ్చటను జాఱఁగనీక
పదమైత్రియర్థసం ♦ పదలఁబొదలఁ
దలఁపెల్లనక్లిష్ట ♦ తనుబ్రదీపితముగాఁ
బునరుక్తిదోషంబు ♦ పొంతఁబోక
యాకాంక్షితస్ఫూర్తి ♦ యాచరించుచును శా
ఖాచంక్రమక్రియఁ ♦ గడవఁజనక
ప్రకృతార్థభావంబు ♦ పాదుకొనదుకుచు
నుత్పత్తియందున ♦ తూర్జితముగ
తే॥ గీ॥ నొకటబూర్వోత్తరవిరోధ ♦ మొందకుండ
దత్తదవయవ వాక్యతా ♦ త్పర్యభేద
ములుమహాకావ్యతాత్పర్య♦ మునకనొసరఁ
బలుకనేర్పుటబహుతపః ♦ ఫలముకాదె॥

నీవాక్చాతుర్యము వాణికైనను యరుదు. ఇన్నివిషయంబు లారసిన నీకే వారిరువురకును మైత్రిం గూర్పంగజాలిన శక్తియుండు. [పాత్రికలవంకం జూచి] మీరందరునుబూని దేవకార్యమునకు సాయమొనర్పవలయును. శుచిముఖీ! నీవు తత్క్షణంబ బయల్వెడలి ద్వారవతికేగి వాసుదేవు సందర్శించి సకలంబు నివేదింపుము.

దూ:—చిత్తము.

[ప్రథమాంకము—సమాప్తము.]





# ప్రభావతీప్రద్యుమ్నము



[ద్వితీయాంకము - ప్రథమరంగము - శ్రీకృష్ణుని మందిరము.]

[అనుబంధము 7.]

శుచిముఖి:— [దూరమునుండి కృష్ణుఁ గన్గొని] ఆహా! ఏమి యీ పురాకృతసుకృత పరిపాకవిశేషము. అదిగో! మురళీగాన వినోదుఁ డష్టకళత్రా సహితుండై వారివలనలాలనలుఁ బొందుచున్నాఁడు. ఆహా! ఏమియీ రమాకాంతుని విలాసరమ.

తే॥ గీ॥ భార్యలెనమండ్రునొక్కట ♦ భక్తిసేయ
మందహాసంబుమోమున ♦ కందళింప
నింద్రచందురు బోలియు ♦ నెఱయుచుండు
మురహరు విలాసమునుజూడ ♦ మోదమొదవె

తే॥ క్రొమ్మెఱుంగులతోడికా ♦ రొమ్మొగుళులఁ బోలె
నొప్పు శ్రీకృష్ణుఁ గనుభాగ్య ♦ మొనరెనాకు
పాపముల్ నశియించెపా ♦ వనతఁ గాంచె
జన్మ మింకను గల్గునా ♦ జగమునందు.

[అనుబంధము 8.]

[నమస్కరించి] దేవాధిదేవా! విజయోస్తు. విజయోస్తు.

దండకము:— శ్రీదేవకీనంద! బృందారబృందాను సంస్తుత్య! శ్రీభక్తమందార! శ్రీసారసాక్షీ మనోపద్మసంచార భృంగాభిరామా! సులీలావిలాసాది శృంగార! సద్వంశక్షీరాంభ వారాసి రాకాశశాంకా! నిర్వక్రిసద్విక్రిసంస్తుభ్యసంగ్రామ భీమో జ్వలాధారలోకైకచక్రాంగధారా! పరిపూర్ణాతివిశ్వాస!

కారుణ్యశీలాలవాలా! కృపాలాలోల! గోపాలబాలా! ఘనాలోలకాలా! లసన్మోక్ష దక్షైకవారిసాదపాలా! వియత్కాల జాజ్వల్య పూత్కార దందహ్యరాత్రించరాజాల! అక్షీణవిస్తారవేలాంత పర్యంతభూచక్రి భూపాలసంపాల! వ్యాలోల సంలాలవ్యాకీర్ణ భృంగాళిలాలాట నీలాలకావ్యాళ! సద్భక్తమందారమాలా! భయాకార సంసారసంబంధ నున్మూల!

మీనంబవై బుట్టి మున్నీటినింజొచ్చియుం సోమకానామరాకాసినిం గూల్చివేదంబులన్ దెచ్చి వేగంబెవాభర్తకుంగనియ్యవే మమ్ములంకావవేదేవ!

కూర్మంబవై నీవె విశ్వంభరన్ దాల్చి దివ్యామృతంబిచ్చి దేవాదులం బ్రోవవేదేవ!

క్రోడంబవై నీవు భూచక్రము౦ దాల్చివేగఁ హిరణ్యా క్షునింగూల్చి భూమాసతిం బ్రోవవే దేవ!

కుబ్జుండవై యత్రికింబుట్టిచేచాచి దానంబు నీవాబలి న్వేడి బ్రహ్మాండరూపంబునుందాల్చి పాతాళలోకంబుచేరంగ త్రొక్కంగలేదా రమాదేవ!

సామేనుసింగంబు సామేను మానిసియునువై బుట్టి భక్తుం డు ప్రహ్లాదునింగావవే దేవ!

రాముఁకలంజంపి శౌర్యంబుదీపింప పరశురామ రూపం బునుందాల్పవే దేవ!

రామావతారంబు లంకేశుధ్వసంబుగావించి సీతామహాదేవినిం బ్రోవవే దేవ!

కృష్ణుండవై బుట్టినీవిప్పు నింద్రాదులంగావ బుద్ధుండునీవే కదా దేవ! లక్ష్మీశ! మాంపాహి. మాంపాహి. మాంపాహి.

దేవా! ఏనుశుచిముఖి యనుదానను. దేవదూతికను. ఇంద్రుండునన్ను మూకొక్క రహస్యంబుఁ జెప్పఁ బుత్తెంచె.

కృష్ణుఁడు:— శుచిముఖి! జంకువీడి పలుకుము.

శు:— నందనందనా! అయ్యది యేకాంతమునంబల్క వలయును.

కృ:— [కనుసన్నచే నందఱుపోయిన పిదప] ఇంకనుడువుము. శంకవీడియావద్వృత్తాంబును సాంతంబుగాఁ బల్కుము.

శు:— ముకుందా! భువనత్రయంబుల నీయుదరంబునం

బూనిరక్షించు నీకెఱుంగరాని దెందైనంగలదా? సర్వశకాని ధవగునీచెంతం బల్కనంతటి చతురనుగాను. అయినను భవన్మహిమంబును నెమ్మనంబునందలంచి నుమువసాహసించెద.

మమ్ముల నొక్కనాఁ డింద్రుండు బిలువంబంచి వజ్రపురీ విశేషంబులం బల్కుండనియె ఏనందొక్క సారసాకరంబున విహంగరూపమున చరించుచుండ వజ్రనాభుని పట్టియగు ప్రభావతికీశ్వరి ప్రసాదించిన ప్రద్యుమ్నుని చిత్రఫలకముంగాంచి నా బాలామణి పొందిన పాటిల్లంజూచి యుంటింగాన నద్దానిఁ దెలియఁ బల్కితి. అందుల కమరనాయకుండు సంతసించి యితివృత్తంబు మీకు విన్నవింపంబంచె.

కృ:— [ఆత్మగతమున] మజ్జనకు నధ్వరశాల వసుగులు బల్కిన పల్కులు వజ్రనాభనధ కెంతయో సాయపడులాగున్నది [శుచిముఖింజూచి] శుచిముఖీ!

చ॥ * బలవిభవాభిశోభితుఁడ ♦ భంగురశౌర్యధురం ధరుండుకా
వలసినిమాయలన్నివిజ ♦ నైరులకంటెఁ గరంబునేర్చు నీ
పలుకుల చందమారయఁబ్ర ♦ భావతికింబతిగాఁ గలాఁడు ని
చ్చలముగ రుక్మిణీసుతుఁడు ♦ చంపునవశ్యము వజ్రనాభునిఁ

శు:— దేవా! ఒక్కసందియంబు.

కృ:— తెలిసినది. అట్టి శంకలనుపేకుము. పోఁతుటేఁ గకైనను చొరరానినద్దనుజ పట్టణంబు నీతండవశ్యంబుఁజొచ్చు వజ్రనాభునింగడతేర్చు. అయిన నీవీ చిన్న కార్యమును నిర్వర్తింపవలయును. నాతండ్రి యధ్వరంబు సేయుచుండ భద్రుఁడ

ను నటుఁడొక్కండరుదెంచి వివిధనాట్యరీతులఁ బ్రదర్శించిచేసి సర్వజనామోదంబునందె.

వాఁడు మహానులాశీర్వచన ప్రభావంబున సప్తద్వీపములందును నాట్యరీతుల నెఱపుచున్నాఁడు. ఈ వెళ్లినను వజ్రనాభునిచెంత యాతనినిఁ గొనియాడి నాశఁగొల్చిరానను జ్ఞఁ గొనుము. మదనుడంత తనంతతానేవచ్చి కార్యమునెఱవేర్చును.

శు:— దేవా! సెలవా?

కృ— చేయుము [నిష్క్రమింతురు] [తెఱజాఱును.]

ద్వితీయాంకము ప్రథమరంగము సమాప్తము.





# ప్రభావతీ ప్రద్యుమ్నము.



[ద్వితీయాంకము-ద్వితీయరంగము-మార్గమధ్యంబున ప్రద్యుమ్నుండుండుట]

శుచిముఖి:—[కనుఁగొని] అతఁడే కాంబోలు నశ్వశిక్షుం గను బడలియున్న ప్రద్యుమ్నుండు.

తే॥ గీ॥ అశ్వశిక్షలయందాడి ♦ నలసియుండు
అతఁడె ప్రద్యుమ్నుఁ డచటికి ♦ నరిగిపలుక
రించెద నవశ్యమాతని ♦ నంచితముగ
పలుకరించుట యేనాకు ♦ భద్రమౌను॥

ప్ర:—[ధ్వనినాలకించి] ఆ! ఎక్కడి దీస్వనము. కనుద ధ్వనముం కీ యెవ్వతో యబలాలలామ నానాను ముచ్చరించి నట్లున్నది. 'అతఁడె ప్రద్యుమ్నుఁడు' అని యెవ్వరు పలికియుం దురు. వారికి నావలనఁ గలుగు లాభమెయ్యదియో కదా!

అదిగో! అడుగుల చప్పుడు వినఁబడుచున్నది. సమీ పమునకే వచ్చునట్లున్నది. [సమీపించును]

ప్ర:—నిలింపలలనా! నీవెవ్వరితోనో సంభాషింప నభిలషించినట్టులు నీవాక్కులనుండి దెలియవచ్చె. ఎవ్వరితో భాషింపనెంచితివో తెలియంగునా?

శు:—కుమారా!

ఉ॥ * ఇచ్చటమేము వేఁడుమటి ♦ యెవ్వరితోడను మాట
లాడఁగా
వచ్చెదమచ్యుతాత్మజది ♦ వస్తుతిపంపున కృష్ణుపాలికిన్
వచ్చియతండు వీక్కొలుప ♦ వారలయిద్దరయాజ్ఞలన్
హెచ్చరికన్ ధరించియిపు ♦ డేఁగెడులాగిది యొక్కచోటి
కిన్॥

మధ్యేమార్గంబున నిన్నుగాంచి పలుకరించుట మేలని యెంచి యిట్లు చేసితిని. ఏను కృష్ణేంద్రులకు కడుప్రియను. నీవత్యంత కార్యధురంధరత్వంబు వహించియున్నవాఁడవు కావునఁ బలుకరింప నుంకించితిని.

ప్ర:—దేవాంగనా! మీరుపోయెడు కార్యంబు కడుంగడు రహస్యంబుకానోపు. ఒరులకుఁ జెప్పకూడదేమో. కార్యమట్టులుండనిండు. ఎందులకై నాప్రసంగంబు వచ్చెనో నద్దానిం దెలియనగునా?

శు:—కుమారా! నీకు జెప్పని రహస్యంబు లేమియు న్నవి.

తే॥ గీ॥ మాధవుండన్న నీవన్న ♦ మాకునొకటె
తండ్రిప్రతిబింబమేకాదె ♦ తనయుఁడరయ

కానని న్నెయార్తావను ♦ గానుచలంచి
నుతుపుదుసకలకార్యంబు ♦ నడరులేక॥

కుమారా! ఆలకింపుము.

క॥ * వినవయ్యా! వజ్రనాభుం
డనియెడునొకదైత్యుఁజంప ♦ యత్నముసతతం
బు నునసుచుచున్నయదిబహు
దినములనుండియును హరికి ♦ దేవేంద్రునకున్॥

వాఁడు తమకన్న మున్నునేమాయోపాయంబులఁ
బన్ను నోయని శంకించి నన్నుఁ బనుప నేనిప్పుడే వజ్రపురికిఁ
బోవుచున్నదాన.

ప్ర:—కట్టా! ఇదియొక దుర్ఘటమైనదని దలంచి కృష్ణేం
ద్రులెంత వగఁజెందెదరు. తమమహిమఁ దారెరుంగరు
కాఁబోలు. అయ్యమరాహితుకులం కషంబుగా నాశంబు
గావింప యేనొక్కండచాలనే.

శు:—ప్రద్యుమ్నా! నీశౌర్యమెంతయో కొనియాడఁ
దగియున్నది.

సహస్రాక్షుండును, రమాకాంతుండును పరిపరివిధం
బుల యోజించుచుండ వారినియోగబలంబున యేనొక్కండ
పరిమార్తునంటివికదా! ఇవ్వార్త యొక్కటిచాలదా నీశౌర్య
ధైర్య గాంభీర్య గుణంబుల నెత్తి చాటుటకు.

కుమారా! ఇఁకనీ ప్రసంగకారణంబు నాలకింపుము
మున్నొక్కతఱి నేను వజ్రపురీ పరిసర సారసాకరంబుల విహా

రించుచుండ లతామందిరంబున సఖీపరివృతయైయున్న నొక్క
కన్యాలలామంగాంచితి. దానిచెలువంబు వర్ణనాతీతము. ఏను
వాణి పెంపున నగుటంజేసి

ఆ॥ * అజుఁడెయొకప్రసంగ ♦ మైచెప్పవింటిని
క్కాంత యతని సృష్టి ♦ గాకునికియు
నాదిశక్తి శివుమ ♦ హాదేవితనదైన
చిత్రమహిమచే సృ ♦ జించెనుటయును॥
చెలువమన్న నదియ చెలువంబు.

సీ॥ వారిజంబదికాని ♦ వదనబింబముకాదు
కల్వరేకులుగాని ♦ కనులుకావు
చంపకంబదికాని ♦ సరవినాసికకాదు
మోహనంబదికాని ♦ మోవికాదు
పసిఁడికుండలెకాని ♦ పాలిండ్లుకావవి
కమనీయలతగాని ♦ కరముకాదు
గగనమేయదిగాని ♦ కటితలమదికాదు
మెఱుఁగుప్రతీవయకాని ♦ మేనుగాదు

తే॥ గీ॥ అమృతతుల్యములై వాక్కు ♦ లలరుచుండు
రాకరాకయెయాగాని ♦ రాకగాదు
భాగ్యదేవతయేగాని ♦ బాలకాదు
అంజనశలాకయాగాని ♦ అబలకాదు

తే॥ గీ॥ కువలయేశుఁడొక్కటనిన్నుఁ ♦ గవయఁజూచు
ఇనుఁడుమఱిమఱి నిన్గూడ ♦ నెదనుపలఁచు

ఇరువుగకును నీవేగతి ♦ నింపుసేతు
సరవిఁజెప్పమోనేర్పుమై ♦ సరసినీవు
అంచు కాటించు మదనుఁడా ♦ యంచగమన॥

తే॥ గీ॥ చోరసారంగములుజేర ♦ చోటుకాదు
నిరతము కనకనామముండు ♦ నియమమునను
కాచుచున్నాఁడు రసదాత ♦ కానదెలియు
దానినైర్మల్యచరితము ♦ ఘనుఁడవీవు॥

సీ॥ చంద్రమోశి వదనమోశి ♦ చెందమ్ములోలేక
కన్నులో పరికించి ♦ కాంతఁజూడ
నిక్కంపుటద్దమో ♦ చెక్కులో బింబమో
యదిలేకనధరమో ♦ అఁదయఁగాను
ధవళపుష్పంబులో ♦ దంతజాలంబులోశి
వాణియోమణిలేక ♦ వాయితేఱయొ
జాళువాపసిఁడియో ♦ చానమైకాంతియో
అనఁటులోలేకను ♦ అవియూరువులో

తే॥ గీ॥ అనఁగసందియమొదవును ♦ యబలఁజూడ
కాయజుఁడుపనిబూనితా ♦ కదువుగట్టి
పోతఁబోసెనోనాదోచు ♦ పొంకమరయ
భాషతక్కవవర్ణింపఁ ♦ బొలఁదలఁచి॥

ఇంతేల.

సీ॥ * నెత్తమ్ములనుచుఁగ్రొ ♦ న్నెలలంచువటఫల
శ్రీలంచుతాఁబేటి ♦ చిప్పలనుచు

నమ్ములపొద్దులంచు ♦ ననఁటికంబములనుచు
బులినమంచును సుడి ♦ చెలువమనుచు
హరిమధ్యమంబంచు ♦ హైమకుంభములంచు
నవమృణాళములనుచు ♦ జివురులంచు,
మదనుశంఖమటంచు ♦ మణిదర్పణములంచు
బగడమంచునుఁ దిల ♦ ప్రసవమనుచు

తే॥ గీ॥ శఫరులనుచుసింగిణులంచు ♦ జంద్రఖండ
మనుచు శ్రీకారములటంచు ♦ నఖలటంచు
నిట్టివికదయ్య! చెప్పఁబో ♦ యిననుపములు
వీనిఁదడవసిగ్గొదువున ♦ న్వాలఁదినెంచి॥

అక్కన్యాలలామ నామంబు ప్రభావతి. అయ్యది వజ్రనాభునిపట్టి. ఆకాంతామణికి స్వప్నంబున శాంకరిసాక్షాత్కరించి నొక్కచిత్రఫలకము నిచ్చెచనియెః. అందులిఖితమైన రూపము నిన్నుఁ బోలియుంచుటంజేసి ‹అతండ డితండ' నవలసివచ్చె.

కుమారా! ఇఁక జాగుసేయుట తగవుకాదు. పోయెదను

[ద్వితీయాంకము—సమాప్తము]



# శ్రీ ప్రభావతీ ప్రద్యుమ్నము.

[తృతీయాంకము - ప్రథమరంగము—ఇరువురు స్నేహితులు.]

మొదటివాఁడు:—ఓరీ! మనము ప్రద్యుమ్నుని పలుకరించి చాలకాలమయినది కదా?

రెండవవాఁడు:—ఏమట్లు సందేహించుచుంటివి ఏనాఁడు మనమిరువురమును గద సాంబులకు కన్యల వెదుకంబోయితిమో నాఁడు మొదలు వానిబలుకరింపలేదు.

మొ:—మిత్రమా! మనకన్యాన్వేషణము సఫలమైన వృత్తాంతము నప్పుడే గద సాంబులకు దెలియంబల్కితిని. తక్కుంగల కార్య నిర్వహణంబు నీశ్వరుఁడే పూర్తిగావించును. ఆకథ యట్లుండ నీ మధ్యమన ప్రద్యుమ్నునకేమో మన్మథచేష్టలు బలపడినవఁట. నీకేమైనఁ దెలుసునా?

రెం:—నేనును నీవలెనే యాతని విరహపరితాపమును విని చాటుననుండి యాతని వృత్తిముల కొంతవఱకు గ్రహించితిని.

మొ:—ఏమి! బద్ధానురాగుఁడైనట్లు దెలిసెనా? ఎవరిపై?

రెం:—ఏమి! బద్ధానురాగుఁడని యొక్కమారు బల్కితివి. మున్మారు బల్కుము. ఆలకింపుము. వానిపిచ్చి

ని కొంత వివరించెదను. చెప్పుటకుమునుపు నినొక్కటడు గతలయును ఈమధ్య శుచిముఖి రాకపోకల నేమైన కర్ణా కర్ణికగా వినియున్నావా?

ము:—కావుననే యట్లడిగితిని.

రెం:—అయిన వినుము.

సీ॥ వీరువారనిమెఱు ♦ విజ్ఞానమే లేదు
పలుకరింపఁడువాడు ♦ ప్రాణహితుల
పల్కుపల్కులకెల్ల ♦ బధిరత్వమువహించు
వహానతతాంబూని ♦ వరుగునట్లె
స్నానపానములైన ♦ సరకుఁగొనఁడుయెంత
పిల్చినఁపోవఁడు ♦ ప్రేమవిడఁడు
పరిచర్యలెవ్వియు ♦ పనివాండ్రచేతాఁగొ
నక పనులన్నింట ♦ సాకులిడును.

తే॥ గీ॥ శుచిముఖి పలుకుల కతఁడు ♦ సాక్కినెప్పుడు
తాప్రభావతి రూపంబు ♦ తలఁచుమదిని
తలఁచి నిట్టూర్పునిగిడించి ♦ తనదుప్రాణ
మట్టె నిల్పుదాని నెదను ♦ తరలుదెపుఁడు

సీ॥ * ఆరూపుమదిజాల ♦ హత్తించిహత్తించి
అతివయిట్టిదిగాక ♦ యనుచుమెచ్చి
మెచ్చికన్గొనుకోర్కి ♦ హెచ్చించిహెచ్చించి
అంతమేలెట్లబ్బు ♦ ననుచువగచు
వగచి నిట్టూర్పులు ♦ నిగిడించి నిగిడించి

తదవలోకము లేని ♦ బ్రదుకు రోయు
రోసిదానికుపాయ ♦ మారసించి యారసించి
కలకనేమియుదొర ♦ కమికికుందు

తే॥ గీ॥ కుంది తలపోఁతలకు మదిఁ ♦ గొల్లవిడుచు
విడిచి దరిదాపు లేమిఁ పై ♦ న్వెతలమునుఁగు
మునిఁగి యెవ్వరు పిలిచినఁ ♦ గినియుమిగుల
హరినుతుండు ప్రభావతీ ♦ విరహావశత

మొ:—ఓహో! పిచ్చితల కెక్కినట్లున్నది. ఇదియును మంచిదేగద. గదసాంబులకును యీతనికి పిచ్చియెక్కి యుండు ను. మనమెంచినది యదియే. ఏల్లని వీరిప్రేమలతలు ఫల సమన్వితములైన దుష్టరాక్షసనివారణమైలోకంబు క్షేమపడును.

రెం:—అదియే ప్రధానము. ఇంకను వాని చర్యల గమనింతము పద.

[నిష్క్రమణము—ఇది విష్కంభము]

[ఉద్యానవనము—ప్రద్యుమ్నుఁడొంటరియై కూర్చుండి విరహవేదనఁబడుట]

[అనుబంధము 9.]

ప్రద్యు:—శుచిముఖీ! శుచిముఖీ! ప్రభావతీ! ప్రభావతీ! యెక్కడి ప్రభావతి. అయ్యో! ప్రభావతినుండి నామంబుఁ ద్రిప్పఁజాలకున్నాఁడ. శుచిముఖీ! కనికరించి చూపుమా తనవి తీరఁజూచెద. ఏమిది? ఎక్కడ శుచిముఖి. ఎక్కడ ప్రభావ తి. రెండును రెండు గగనకుసుమములే.

ఓరీ! మలయపవనా! నీకించుక చల్లదనము కలిగిన మాత్రంబుననే కఱుకుఁజూపెదవే. నాపై నించుక కనికరించ కూడదా? నీగంధవహనామము ప్రభావతీ జాడఁదెలిపి సార్థక పఱచుకొనకూడదా?

ఆ! ఇట్టి మంద ప్రకృతితో మొఱఁబెట్టుకొన్న జెవిటికి శంఖూదినట్లే.

ఇదిగో! నాప్రభావతి. నిండు పూగుత్తులే బిగువుపాలిం డ్లు. నూతనపల్లవంబులే కరతలంబులు. ఎలదీగియల సొంపే సుకుమార బాహువిస్ఫురణము. మరందసేవమున వ్రాలియుం డు తుమ్మెదలే క్రీగంటిచూపులు. మల్లెలవెల్లదనమే మంద హాసము. ఈవుద్యానవనమే నాప్రభావతి.

ఇదియేమివిచ్చి? ఎవరు నిందులేకుండగనే వికసించి చివు రెత్తియున్న లతాదులంగాంచి ప్రభావతియని భ్రమపడితిని. నాకట్టి భాగ్యంబుకూడ లభించునా?

[విషమసందేహంబున]

సీసమాలిక॥ ఏనేలహాయముల ♦ నీరీతినాడించు
చుంటినో యొంటిమై ♦ మాంచిచూచి
ఆడించుచుంటిబో ♦ యమరదూతికయది
పల్కనేలకొనాలో ♦ మార్గమునను
పలికెబోయదిప్రభా ♦ వతిహావగుణముల
నేలకోవర్ణించి ♦ పలికెనాకు
వర్ణించిపలికెబో ♦ భామగుణములేల

వింటినిశ్రద్ధతో ♦ విదితముగను.
వింటిబోనద్దాని ♦ వింతచెలువమేల
మనముననాఁటెనో ♦ ఘనముగాను
నాఁటెబోమనమున ♦ నాటినుండియుప్రేమ
నాకేలకల్గెనో ♦ నాతిపైన
కల్గెబోనదియుర ♦ క్కసికినిపట్టైమై
పుట్టనేలక్షో భువి ♦ పొందుగాను
పుట్టెఁబోనేరీతి ♦ పూర్తిగావింతును
నామనోభావంబు ♦ నీమమునను
తే॥ గీ॥ కూల్తునావజ్రనాభుని? ♦ కూల్చుటెట్లు?
చొత్తునావజ్రపురిని? నే ♦ చొచ్చుటెట్లు?
తెత్తునారమణీమణి? ♦ దెచ్చుటెట్లు?
పోదునాతండ్రిచెంతకు? ♦ పోవనేల?
విడుతునానాతలంపును? ♦ విడుచుటెట్లు?
ఎట్లుసేతుకార్యము? దోఁచ ♦ దెయ్యదియును.

ఆహా! ఎంతవెడఁగుపనిఁ గావించితిని. నేనేమఱిపాటు నఁబరామర్శింపక పోయితినిగదా. పాపపులజ్జ నానోరదిమిపట్ట నేనేమిచేయుదు. శుచిముఖి నొక్కమాట పలుకరించియుందు నా సర్వమును దెల్లమై యుండును. పలుకరించియుండిన కార్యమైయుండునా? అయ్యేతీరవలయును. గగనస్థమై యుండిన శుచిముఖి పనిబూని.నాకన్యనేల వర్ణించిచెప్పెను. అన్నిఁటి కన్న నెక్కువగా నేమిపలికెను? "సరసిజనేత్ర దక్షిణ భుజం భవు నీవు" అనిగదా. దీనినంతయుఁ బరికించిచూడ వజ్రనాభునిఁ

జంపయత్నము జరుగుచుండవలయును. అట్లు సంభవించి నచో నేపోవలసియుండును. పోయినచో నెల్లినను సంగమం బులభించును. ఇంకొక్క విశేషంబు సమితము గ్రహింపఁ దగియున్నది. చిత్రఫలకమునందు శుచిముఖి చూచిన పురుషునిరూపము నన్నుఁబోలినదనిగదా పలికినది. అద్దానిరచించి నదియంబ యని గదా వింటిని. శుచిముఖి యేమనిదెల్పెను. అవ్వారానన బ్రహ్మ సృష్టికాదని బ్రహ్మయే నుడివెననిగదా? అయ్యది నాలించియు, దానికనురూప వరుఁడెవఁడో నను గమఱచితినిగదా.

గతజలసేతు బంధనమున లాభమేమి.

ఇంతయనర్థంబునకును కారణంబు నోరువిడిచి పలుక నదికదా. ఎన్నివిధంబుల వితర్కించి చూచినను లాభమేమియులేదు. అక్కటా! ఇప్పటికొక్క వెరవుదోఁచుచున్నది. ఇదిగో! నిచ్చటపడియుండు భూర్జపత్రముఁదీసి ప్రభావతిపేర నొక్క లేఖలిఖించెద. [వ్రాయును] దీనిని గొనిపోయినా ప్రేయసికిఁ జేర్చువారెవ్వరు.

సీ॥ *కృపనెఱిఁగింపరే ♦ కీరోత్తములార!
వజ్రపురికిపోవు ♦ వారెమీరు
సదనుగ్రహమునఁదు ♦ తుమ్మెదలార! చెప్పరే
వజ్రపురికిపోవు ♦ వారెమీరు
కరుణతోవినిపింపఁ ♦ గదరెకోయిలలార!
వజ్రపురికిపోవు ♦ వారెమీరు

తెలుపరేదయఁ జూచి ♦ మలయవాయువులార!
వజ్రపురికిపోవు ♦ వారెవ్వారు

తే॥ గీ॥ చలువలొసఁగెడు మేఘరా ♦ జంబులార!
యమలపక్షతనొప్పరా ♦ యంచలార!
నిలిచినామాటలకు మాఱు ♦ పలుకరయ్య
వజ్రపురికిబోయెడి ♦ వారెవ్వారు

[నేపథ్యంబున] అయ్యా! నేవజ్రపురికేగుదానను. నావ లన వలసిన సాహాయ్యమ్ముఁ జేసెదను.

ప్ర:— శకుంతరాజమా! మేలు మేలు వజ్రపురియందు శుచిముఖియను నొక హంసాంగనగలదు. దానినెల వెతింగి యేనిచ్చు పత్రికనందింపవలయు.

[నేపథ్యంబున] అయ్యా! మాటాడుట కవకాసంబులేదు. త్వరితగతి నొరులకెఱుక వడకుండ నాయెఱుక లందాయుత్త రంబు నిమ్ము.

[సమీపించును - అట్లేచేయును - లేచిపోవును.]

[తెరలో] ప్రద్యుమ్నా! రారమ్ము చాలు చాలు తడ వైనది.

ప్ర:— ఓహో నామిత్రులు కాబోలు నిటకువచ్చుచున్నారు. ఇఁక వారు పరిహసింతురు. వారిని గలిసికొందును.

[నిష్క్రమించును.]

[తృతీయాంకము - ప్రథమరంగము సమాప్తము.]



# ప్రభావతీ ప్రద్యుమ్నము.



[తృతీయాంకము - ద్వితీయరంగము - ఉద్యానవనము.]

[అనుబంధము 10. ]

ప్రభావతి:— [చిత్రఫలకముఁ గేలఁబూని] ఔరా! సౌందర్యంబన్ననిదిగదా సౌందర్యంబు.. శివయేటికినాకీచిత్ర ఫలకమునిచ్చె. ఇచ్చెఁబో నాకేల యింతటి యను రాగంబుఁగలుగఁ జేసె. [మఱలఁజూచి] ఔరా! ఇందు జీవకళయట్టే యుట్టిపడుచున్నది. నయనంబులుకు రంగంబులఁ గేరుచున్నది. మందస్మితంబు మల్లెల మఱుఁగుఁ జేయుచున్నది. అయ్యో! ఏమున్ననేమి కేవలము ఫలకమును జూచితనివి నొందవలసినదేకదా? చూడఁజూడనాకు మనోవ్యథదప్ప మఱేమియుఁ గానరాదు.

ఈశ్వరీ! నన్నేల యిట్లలయించెదవు. భవద్పద రాజీవంబుల హృదయ పీఠమున నునిచి యాశాకుసుమంబులఁ బూజించుతటి నేమైనఁ గొఱఁతగలిగెనా? కలిగియుండిన క్షమింపుము. జగన్మాతవగు నీకీబిడ డేసిన దోసంబుసైరించుట

యొక కష్టమా? మాతా! నీపుత్రుఁ దలంచికాదే యేసింత వగఁజెందుట. ఎవ్వరిని ధ్యానించుదాన. సకల చరాచర హృదయాంతర్గతయై - శుభంకరయై - అర్థులపాలి కల్పతరువై తనరారునా యిందిర హృన్మందిరమున ధ్యానించెద.

మంజరి॥ క్షీరసాగరకన్య ♦ క్షితినేలుతల్లి!
వారిజదళనేత్రి ♦ వరవర్ణగాత్రి!
అఖిలలోకజనని! ♦ ఆమ్నాయవినుత!
విష్ణుమనోరమ! ♦ ధీరచరిత్రి!
వరదయాకరి! మృదు♦పాణిలావణ్య!
అమరకోటికిరీట ♦ ఆరాధితాంఘ్రి!
రత్నప్రభాభాస! ♦ రమణీలలామ!
పాదపద్మయుగళ ♦ పరమకల్యాణి!
లక్ష్మి! లోకజనని! ♦ లావణ్యనిధిరో!
మన్మథమాతరో! ♦ మహితచరిత్రి!
కరుణాంబునెలవవు ♦ కంజాతనేత్రి!
కరుణనన్నేలుమ ♦ కమభక్తిసేతు.

[ప్రభావతి ఫలకముపై - ధ్యానముతో నుండు]

—: సఖులుప్రవేశింతురు: —

రాగవల్లరి:— ఔరా! ఏమి యీవుద్యానవన నూతనశోభ. ఏవంకఁ జూచినను మందారాది దివ్యసౌరభములు వుగులుకొనుచున్నవి. కుసుమరాజి-కన్నుల పండువుఁగావించుచున్నది.

ద్విపద॥ మల్లెలు మొల్లెలు ♦ మఱిపూల్గములు
పెల్లగువాసన ♦ ప్రేమనునించు
బంగరుతీగల ♦ బాగువహించు
రంగగుకూనల ♦ రమ్యతఁజూడ
రతనాలగుంపుల ♦ రాగముమించు
వితముగచివురుల ♦ విడిచియుచెట్లు
పచ్చనియాకుల ♦ బాగనుజూడ
అచ్చఁపుచిలుకలె ♦ యానవిదోచు

[నలుదిక్కులఁజూచి] ఆహా! ఏమి యీ ప్రభావతి గాఢానురాగము. ప్రభావతీ! ప్రభావతీ!

ప్రభా:—[సంభ్రమమున ఫలకమును మఱుఁగునబెట్టి] ఎవరక్కడ? రాగవల్లరీ! చెలులారా! రండు.

రా:—ఏమే నీచేఁతనుండినది చెలీ!

ప్ర:—ఏమియునుండ లేదే.

ప్ర:—పోనీ ఆ ఫలక మెవ్వరిదే?

ప్ర:—ఫలకమా! ఏమిటి

శి:—అదియే నీకేలనుండినది.

ప్ర:—నాకేల నేమియు నుండలేదే!

శి:—లేకున్న సరియే. నీవాకించుక నిలువంబడుము.

ప్ర:—ఎందుకే?

శి:—వినోదార్థము చరింపంబోదము.

ప్ర:—ఇట్టిబొంకులేలనే? చూచుకొనుము ఫలకము న్న దేమో.

శి:—ఫలకమని నీవే జ్ఞప్తికిఁదెచ్చెదవే. "గుమ్మడి కాయల దొంగ యెవరన్న భుజములదాకికొన్నట్లున్న దే"

రా:—దానివిచారము మన కేమి? వినోదముగా చరింతము రండు. [చరింతురు]

(అనుబంధము 11.)

శి:—అయ్యో! ఇంకేమిగతి. మనవిహారమునఁ గఁల తేఁజెంది మరందముల నాస్వాదించుచుండిన మధుమక్షికములు విజృంభించి ప్రభావతి చెఱఁగుపైవాలినవి.

[ప్రభావతి రేమరుపాటన-చేలాంచము విదుల్చును. ఆలేఖ్యము క్రిందపడును.]

శి:—దానినియ్యవే. దానినియ్యవే.

ప్ర:—దేనినే? అళిమూఁకనా?

రా:—ప్రభావతీ! మావద్దనే నీసామర్థ్యంబులఁ జూపెదవే?

[శుచిముఖిప్రవేశించి ఫలకమువంక చూచుచుండును.]

రా:—ఎవరమ్మా! నీవు? చిత్రఫలకమువంకఁ జూచుచున్నావు.

శు:—నేను మీచెలినే. ఆకసమార్గంబున సంచరించుచుండి నాచెలి విరహమును చూడలేక దిగివచ్చితి.

శి:—సరియైనసాక్షి. ప్రభావతీ! చూచితివే. నీగుట్టు బయల్పడినది.

కి:—అయ్యో! యిదియేమే. నగుబాట్లుచేటు. నీవిరహాముఖచరములకు సయితము దెలిసినది.

శి:—అయ్యో! ఇట్టిబ్రదుకు బ్రదుకుటకన్న ప్రాణము తీసికొనుట మేలు.

ప్ర:—అవును లేవే? మేమంతాయల్లే. మీరట్టివాంఛలే లేనివారు.

శు:—కోపమేటికి. ఏను మీచేతి చిత్ర ఫలకముఁ జూడఁగారణంబువినుడు. మున్నొక్కచోట నొక్కపురుషుం గాంచి తత్సమాన రూపు మఱియెందుఁగానక యిప్పుడిందు నప్పురుషు రూపంబుకై వడిఁదోఁచిన తదీయాకారమెఱింగి వ్రాసిన చిత్తరువో లేక మఱొక్కఁడెక్కడెందైనఁ గలిగెనో యని యించుక నిలిచిజూచితి.

ప్ర:— శా॥ * ఏమే మీయిఁక నొక్కమాటుచెప్పుమా ♦
యీవున్న రూపిట్లయో
యేమైనంగలదోవిశేదమిటర ♦ మీ్మ్మక్షింపు
మింకకావచ
స్సామర్థ్యంబరయఁగ మహాత్మవనియ ♦ స్వ
ద్బుద్ధికిందోఁచెదా
హామాభావము గానలేవెమదిలో ♦ అమ్మా
భయం బేటికి॥

తే॥ గీ॥ చెలియ! ఈవంకకరుదెంచి ♦ తెలుపవలయు
చిత్రఫలకముఁజూచివి ♦ చిత్రముగను
ఇట్టిరూపసౌజన్యంబు ♦ ఇలనుగలఁడో
లేడో? యూరటకలుకదు ♦ లేని చోట.

శు:—సోదరీ! యిట్టి మనోహరాకారుఁ డొక్కఁడు కలఁడు.

రా:—ఆహా! నీయుపకృతి మఱువవచ్చునే?

ఉ॥ *ఎంచగఁబూనినీవునను♦నీవిధిప్రోవఁగమూర్తితత్వముం
కాంచినభాగ్యదేవతవు♦గాని మదుక్తి తెలిఁగునేను గె
ల్పించితివే జగంబునను♦లేడిటువంటిమనోహరాంగకుం
డంచుఁగలంచునిజ్జలరు♦హాననమానకనాదుచిత్తముక్

ప్ర:—సోదరీ! ఏమే నీయానందము? ఇల్లలుకగనే పండుగైనదా? ఇట్టి మనోహరాంగు డొక్కఁడున్నాడన్న మాత్రమున నే సందర్శించితిమా! ఎచ్చోటనున్నవాఁడో తెలియమకదా? ఇట్టి విలాసుం డొక్కఁడుండునా?

శు:—తే॥ గీ॥ శంకయేటికే చెలియ! యీ ♦ వంకఁగనుము
తల్లిదండ్రులరూపింద ♦ తాండమాను
ఉరమునవిజయలక్ష్మియు ♦ నుల్లసిల్లు
ఫనుఁగన్నవాడఁగుశంక ♦ యేమిలేదు॥

అతని నామధేయాదులు మీకిప్పటికే తెలిసియుండును. శుద్ధాంత వాసినులగుటంజేసి తెలియకను నుండవచ్చును.

[ప్రభావతింజూచి] ఈవకదా ప్రభావతి యనుదానవు. లతా మందిరంబున నీవు నీచెలితో భాషించుచుండినప్పుడొక్క తరి నిన్నుఁజూచియుంటి. ఏనిఁక దేవలోకమున కేగవలయును, నన్నుమఱువకుము. [నిష్క్రమించును.]

ప్రభావతి:— [చేఁతులు జోడించి.]

సీ॥ వందనంబిదెనీకు ♦ బృందారకరమణి
చెలిమినాకొసఁగుమా ♦ చెలియనీవు
[పైనుండి-శు] వందనంబేలకే? ♦ మందేభగామినీ!
చెలిమికేమికొఱంత ♦ చెలియనీకు
ఆగినాతోడనో ♦ యమరకామిని! నొక్క
మాటాడతగదేమొ ♦ మార్గమునను
[పైనుండి-శు] కాలంబుకాదిది ♦ కామినీ! మాటాడ
పోవఁగావలయునే ♦ నవసరముగ
తే॥ గీ॥ పోదుపోదునటుచునీవు ♦ వాదుసేయ
పాడియేనీకుసోదరీ ♦ ప్రణుతిసేతు
[పైనుండి-శు] కార్యభారంబుపై నుండ ♦ కలుగుటెటులు
కాలమోచెలి! నీతోడ ♦ పలుకలాడ.

రా:— నాప్రార్థనమొక్కింత యాలకింపుము. ఇట్టి మనోహరాకారుని నామధేయాదుల నొక్కింతనుడుము. లేకున్న నీప్రసమకోమలి కడుగాసినొందు.

శు:— [దిగివచ్చి] ద్వారవతియనుపుట భేదనంబొంపు కరంబురాజిల్లుచుండు. అన్నగరరాజంబును యదుకులజలధి

పూర్ణశశాంకుడగు శ్రీకృష్ణుండు నిజభుజాయుత విక్రమంబున పరిపాలించుచున్నవాఁడు. అతనిదేవేరియగు రుక్మిణికి ప్రద్యుమ్నుండను పుత్రుండొక్కండుగలఁడు.

ఉ॥.* శౌర్యమయుండతండుభుజ♦సత్వనిధానము కాంతిరాశిగాం
భీర్య!ఁ పుర్బోవుసత్కళల ♦ పెన్ననిరూపము దాల్చినట్టియౌ
దార్యముపెక్కులేటికిను ♦ దాత్తగుణోదయమాయ
పూర్వసౌం
దర్యత కెంతయెంతయుచి ♦ తంబగునంతయుఁ గల్గిశోభిలుఁ

రా:— ప్రభావతీ! శుచిముఖి వాక్చంద్రిక నీచిత్తచకోరమున కానందంబుగల్గించె. ఉమ్మదను రాగలతలతాంతాశోభితయయ్యె. ఆందోళనంబు వీడిసుఖంబునుండుము. ఇయ్యదియపరవాణియనియే నుడువందగియున్నది. చెలులకు చెలులు ప్రాణంబులిచ్చినను చెలికారబుణముఁ దీర్చుకొనఁజాలరు. [శుచిముఖినుద్దేశించి] సఖి! నీవెఱుంగనిసఖి ధర్మమొందును లేదు కదా. శోషిల్లియుండిన చిత్తమందారము నీవాగమృతధారలచే మఱలపచ్చనయ్యె. అను రాగరత్నమబ్బుట దుర్లభము. ఒక్కచోవచ్చెనావిడనాడ మనమురాదు. అది తనంతఁతానే హృదయ హాటకపీఠస్థయగును. విధివశాత్తుపోయెనాఁ దానితో పాటుజీవముకూడ పోవును. చిత్తమనంతమైన వగలపాలయి కళావిహీనంబగునును. స్వర్ణహీనమైన మణియు మణిహీనమైన స్వర్ణమును భువిరాజిల్లదుగదా. మనోవేగంబున నేగి ధ్యానుకుమారునకు ననుగాగ మంత్రముచేయుము.

శు:— నీవింతగా చెప్పవలయునా? మున్నే నేనీ బాలామణి చిత్తయాందోళనముఁగాంచి ద్వారవతికేగి మార్గమధ్యంబున నాకుమారుఁగాంచి సకలంబునివేదించితి. అతఁడంతయు నాలకించియున్నకుండె.

ప్ర:— రాగవల్లరీ! ఇఁకనాచిత్తతురఁగ మెట్లుపగువిడనోపు నిరాశాపర్వతమడ్డుపడె.

రా:— ఏమే! నీవగ.

శు:— [పరీక్షింపనెంచి] కుమారీ! ఉఁరడిల్లుము. ప్రద్యుమ్నువాంఛవిడిచితివేని కిన్నరకింపురుషాదుల పరియింపుము. భక్తపరాధీనయగు యీశ్వరికిది యెంతమాత్రమునప్రియ కుకాదు. యదుకుమారసమాన రూపలావణ్యుల యాలేఖ్యము లెన్నియైననుఁ దెచ్చియిత్తును. అందు నీయిచ్చవచ్చిన వానిని వరింపుము.

ప్ర:— ఎంతపాపఁపు మాఁటవినఁగలిగె చెలీ! ఇట్లు విరుద్ధముగా బల్కకుము. ఇయ్యదిన్యాయంబే? మందారతరువు నాశ్రయించిన లతకంటక తరుచయంబుల ప్రాపుఁగోరునే? ఏనాఁడు శివనాకు సాక్షాత్కరించి ఫలకమునిచ్చెనో నాఁటి మొదలు దానియందే చిత్తము బద్ధమైయున్నది.

తే॥ గీ॥ ప్రాణములనైన విడుతునే ♦ వానిఁదప్ప
అన్యువరియింపనొల్లను ♦ యాత్మయందు
శుకమునురసాలమునుఁజేరి ♦ సొంపునుండి

ఫలముతనకందలేదంచు ♦ కలఁతనొంది
భూర్జవృక్షముచేరంగ ♦ బోవునెచెలి!
ఇంతమాత్రముదెలియదే? ♦ వింతగాదె?

పాపఁపుదేహమా! భూదేవికి నీవొక్క పెనుభారము.
అంగములారా! మీకుసార్థక్యతయెయ్యది?

సీ॥ ఆమనోహరుమన ♦ సారఁజూచుటకాదె
కన్నులుజేసిన ♦ గరిమలెల్ల
ఆమహామహానామ ♦ మనవరతమునుడు
వుటనుకాదెవాణి ♦ యొప్పుచుంట
ఆమహాభాగుని ♦ యానందచంద్రికల్
గొనికాదెచిత్తచ ♦ కోరమొప్పు
ఆమహామహితుహా ♦ గమృతధారలఁగాదె
ఆకొన్నవీనులు ♦ అలరుచుండు.

తే॥ గీ॥ అతనిపాదసేవనుకాదె ♦ యీతనుకలి
మిదినదినమభివృద్ధియై ♦ మిన్నయౌను
వానిచిత్తసౌధంబుఁగ ♦ వయఁగలేని
జన్మమేఁటికికాల్పనే ♦ జగమునందు.

ఇదియేనా తుదిమాట. దయయుంచి నీవింకొక్క మాఱు ప్రద్యుమ్నుని కడకేగి నామనోవ్యథనెల్లఁ దెలియఁబల్కి మెట్టులేని జీవదానంబుఁ గావింపుము.

ఖు:— ఊరడిల్లుము. నీయనురాగ మిప్పటికి తెల్ల

మైనది. దాని ప్రభావాతిశయం బెలుఁగఁగోరి గొన్ని విషాద వాక్యములనాడితి. నిశ్చయముగ నీవాతని చెట్టఁబట్టఁగలవు.

బ్రహ్మయొక్క సమయంబున బ్రాహ్మితోఁగలహించి విరహానలదందహ్యమాన మానసుండై వాణికనుకమాన్వన న్ను బిలిపించిబంపుచో సకలంబుఁ దెల్పుచుండి.

తే॥ గీ॥ * ఏలరా! మన్మథుఁడనన్ను ♦ నింతయేచు
టేమిమేలురానున్నవి ♦ యిట్టిపాట్లు
నీకునిఁకఁ బ్రభావతియను ♦ నెలఁతపైవి
రాళికారణముగవేగి ♦ రంబువలదు.

అని జెప్పయేనప్పఁడేమి! రతికన్నను ప్రభావతిరూప వతియాయన

క॥ * రతిరూపమెక్కుడప్రభా
వతిరూపెక్కుడవిమర్శ ♦ వంతులుదెలియన్
రతిసాబఁగుకంటెనుఁప్రభా
వతిపసముమ్మడినలుమడి ♦ వాసియగుచెలీ!

అయ్యది తనసృష్టికాదనియు నీశ్వరీ ప్రసాదజనితయని యు నెఱింగించె. ఏనవ్వలనాపనిపై నేగితి. ఆప్రభావతివినేవే మన్మథుంను తప్పక విన్నవరించు.

ప్ర:— అదిగో! బాలరసాలపల్లవంబులమెసఁగును కీరరాజంబొంటుకను ముద్దుగాఁ బాడుచున్నది. దానినిట గొనిదేవే!

[చెలులుపోయి పట్టి దెత్తురు.]

రా:— [నివురుచు] చూచితివా? దీని ఒడలెంతమృదువుగానున్నదో. పచ్చలబొదిగి నట్లెంత యందముగానున్నదో. కంఠంబుసామునల్లనై సాముదెట్టనై ముద్దుగానున్నది.

[ఎఱకలెఁ బెటబెటఁ గొట్టును - ఉత్తరముజాఱిపడును.]

రా:— ఏమీవింత! పత్రికబడుచున్నది. ఇందేమిలిఖయింపఁ బడియున్నది.

సీ॥ * శ్రీమత్సరస్వతీ ♦ రామాకృపాసంప్ర
యుక్తోపమాతిశ ♦ యోక్తికామ
ధేనుసద్బిరుదాంక ♦ దివ్యమంజీరసం
శోభితపాదకు ♦ శుచిముఖకిని
ప్రద్యుమ్నుఁడూర్జిత ♦ ప్రణయపూర్వకముగ
ననిపినయట్టిర ♦ హస్యలేఖ
ప్రప్రభాభావతిఁ ♦ బలుతెఱంగులనీవు వచియింప
శుకముమందార ఫలమునందెను వినుము.
వచియింపనపుడు ♦ నిర్వచనవృత్తి
నేనున్కికల్లగు ♦ ట్టింతియొకానిచూ
యింతియంగములెవ్వి ♦ యెట్లుచెప్పి
తవియెల్లనట్లనా ♦ యాత్మఁదద్దయుఁబడి
అమ్నునసద్దిన ♦ ట్లమరనంటి

మలచినగతిని మిక్కిలి దృఢత్వముఁజెంది
స్వగ్గుణసంపద్ద్వార ♦ వముననేను.

తే॥ గీ॥ యూదిబడలించుచున్నవి ♦ యోమరాళి
అధరసుధఁదేర్చుమనివేఁడు ♦ మూమృగాక్షి
సకలమునునీకుదెలుసునో ♦ సారసాంగి!
వ్రాయనేటికిపనిమాలి ♦ వార్తలన్ని.

ప్ర:— [పరిణయశోభనంబున] జాలు చాలు నిటగో నిదేవే!

[బలవంతముగాలాగి నిలుపంజూచును.]

రా:— ఏమీ! నీచాతుర్యము. వల్లభుండంపిన శుభ లేఖను భాగ్యదేవతఁబోలె పూజించుటమాని యిట్టులోనర్చె దవు. [లోపల] నిశాంగనచిందులు ద్రొక్కుచున్నది. పోద ముపద. ప్రొద్దుపోయినది. చీకటులాక్రమించుచున్నది.

[నిష్క్రమింతురు.]

[తృతీయాంకము - ద్వితీయరంగము సమాప్తము.





# ప్రభావతీ ప్రద్యుమ్నము.



[తృతీయాంకము - తృతీయరంగము - సునాభపురీ పరిసరారామము.]

శుచి:— ఇదిగో! నాఁడు త్తరముఁ గొనిదెచ్చిన శకుంతముతనదు నిజరూపంబున నభినవశకుంతలయై యెటకో బోవుచునిందు విడిసియున్నది. చెలీ! నిన్ను నేఁ గొన్ని విషయంబుల నడుగనుంటినిగ్గాని నాఁడు సంజవడినందున వలనుగాకపోయె. నాఁడు నీవుఁదెచ్చిన యుత్తరము నీకెట్లులభించెను.

శు:— ద్వారవతికే నొక్క కారణంబునఁ జని వచ్చుచుండఁగా మార్గమధ్యంబున.

ద్విపద॥ దినకరునలయించి ♦ దీపించువాఁడు
ఘనకాంతిభాసిల్లు ♦ గాత్రమువాఁడు
నిఘదహస్తములను ♦ నెఱిమించువాఁడు
వెడఁగువక్షంబు ♦ విలసిల్లువాఁడు
కంజముమించెడి ♦ కనుదోయివాఁడు

రంజిలుముఖకాంతి ♦ రాజిలువాఁడు
అళులఁబరిహసించు ♦ నలకమువాఁడు
అలరువిల్కానిని ♦ నలయించువాఁడు

నెవ్వఁడోయొక్కఁడు చరాచరంబులన్నింటిఁ గనుదినత తో ౘవజ్రపురికిఁబోవు. వారెవిూరు' అంచు బతిమాలుచుం డనే విని వానింగాంచి ౘఅయ్యా! నేవజ్రపురికిఁ బోవుదాన. నావలనఁగలుగు కార్యమెయ్యది? అని యడుగ నాతఁడు ౘవజ్ర పురంబున శుచిముఖియను నొక్క దేవాంగన కలదు. దాని నరసి నేనిచ్చు లేఖ నియ్యవలయు' ననియె. అయ్యదియే నాలేఖ.

శు:—పోనిమ్మా. తొలుదొల్త నీవాపురికిఁబోవఁ గారణమేదియో నుడువందగునా?

శు:—ఆ॥ వె॥ *నవనిధానములను ♦ దవిలియిచ్చిననైన
మొదలమీఁదఁగత్తి ♦ యిడిననైనఁ
జాలరనఘచరితు ♦ లేలినవారి ర
హస్యభంగమునకు ♦ ననుమతింప॥

శు:—నీకేలాటి భయంబునులేదు. నేనునీచెలినికానా?

శ:—అక్కా! సునాభపురి యను పుటభేదనం బొండు గలదు.

అద్దాని వజ్రనాభుని సోదరుండగు సునాభుండను రక్కసుండేలుచున్నాడు. ఆతని కిరుగురు తనూజాతలు గలరు.

ఒక్కనాఁడు దివ్యముని యరుదేరవాని నుచిత విధులఁబూజించి సునాభుండు సత్కరించె. అమ్మౌని పరిచర్యకై చంద్రవతీ గుణవతులనుంచె. వారలంత జనకు నానతిఁదలదాలిచి సని యామునికుంజరునకు నమస్కరింప నాతండ మందానంబునఁదేలి 'శీఘ్రమే వపతీ ప్రాప్తిరస్తు' అంచు నాశీర్వదించె. చెంతనుండిన చేటి మునివర్యా! వీరికి భర్తలెవ్వరో యానతిండని యని యడిగిరి. అంత నాతఁడు కొంతయోజించి గదసాంబులనియె.

అంత నమ్మదవతులా సుందరాంగులపై వలఁపుగలిగి దినదినము గుందుచుండిరి.

తే॥ గీ॥ వగవనేలకోయీరీతి ♦ వనితలార!
ముఖవికాసంబుదగ్గదే ♦ సఖులుమీకు
రాగలతతనయంతనే ♦ వేగతనరు
ఫలసమన్వితంబయి ♦ లలితముగను॥

అని వారినూరడించి ద్వారవతికేగి కర్జంబు సాధించుకొనివచ్చితి. ఇంతకువారు.

తే॥ గీ॥ * ఘనపయోవృష్టికిచాత ♦ కములువోలె
గొమరువెన్నెలలకుచకో ♦ రములవోలె
భాస్కరోదయమునకుస ♦ ర్జములవోలె
విదురుజూతురునారాక ♦ కిందుముఖులు॥

శాన సెలవిమ్ము, పోయివచ్చెదను.

శు:—నన్నును నీ వెంటఁ గొనిచని స్నేహామృతమును బాలుపెట్టుము.

శ:—రమ్ము. పోదము.

[తృతీయాంకము—సమాప్తము]





# ప్రభావతీ ప్రద్యుమ్నము

---

[చతుర్థాంకము—ప్రథమరంగము - సునాభపురియందొక్క లతామందిరము]

చంద్రవతీ—గుణవతులు:——ఎంతకాలమయ్యెను. ఇంక ను రాదమ్మె? కార్యమేరీతి పరిణమిల్లెనోగదా. [ఆలించి] ఆహా! ఎక్కడిదీ యవ్యక్త మధురస్వనము శకుంతలదై యుండనోవు.

ఎట్టివృత్తాంతముల దెచ్చెనోకదా? అక్కటా! ఆకంఠ నినదము విరహానల జ్వాలల కాజ్యతుల్యములై దోఁచుచున్న ది. మరల శకుంతము మందారముఁ జేరవోచించుచున్నది.

[శుచిముఖీ సమేతయై శకుంతల ప్రవేశించుచు]

శ:——చెలులారా! ఏలకో మీర లీరీతిననిమిషనయనం బులతోఁ జూచుట. మీకు సర్వశుభంబులు సమకూరు. చెంతనుండు మీచెలిపేరు శుచిముఖి. అయ్యది నాకెంతయు సాహాయ్యమ్ముజేసెను. రహస్యభంగమను భయంబునుగుము,

తే॥ గీ॥ *చంద్రవతి! నీకుపాణేశుఁ • డింద్రనిభుఁడు
గదుఁడుద్వారకనున్నాఁడు • ముదముతోడ
గుణవతీ! నీదు ప్రియుఁడుసా • ద్గుణ్యరాశి
తనరచున్నాఁడుసాంబుఁడెం • తయుశుభమున॥

వారినుచితరీతుల వర్ణించి మీమనోగతంబులఁ దెలియ బల్కితి. మావిగున్నపై పికమువ్రాలె.

చ—గు:—ఆమె యెవ్వరో కదా?

శు:—చెలులారా! ఏను ప్రభావతికిం బ్రాణసఖిని. అమ్మందయాన పనుపున నీరీతి దీని వెన్నంటివచ్చితి. ఇక్క తమ్మున నమూల్య స్నేహరత్నమబ్బె. చాలకాలంబుండ పాడికాదు. మీరహస్యంబుల వెలిపోనీక నెట్టులేని గప్పి వుత్తును. మఱవకుడు. పోయివచ్చెదను.

[నిష్క్రమింతురు]

[చతుర్థాంకము—ప్రథమరంగము సమాప్తము.]



# శ్రీ ప్రభావతీప్రద్యుమ్నము

[చతుర్థాంకము—ద్వితీయరంగము—సౌధము]

[వజ్రనాభుఁడు భార్యాద్వితీయుఁడై యుండును]

వజ్రనాభుఁడు:—మనల నానందాబ్ధిఁ దేల్చు నీయమృత కిరణుని విలాసర నేమని చెప్పవచ్చును. ప్రేయసీ! కనుఁగొంటివా? చల్లగ వీతెంచి మందానిలుండు మనల సుఖంబుల తనియించుచున్నాఁడు. తారలన్నియు మన కాసుధాకరుఁ డంపిన మగరాల రాశిభంగి కరంబలరారుచున్నది.

భా:—నాథా! అదంతయు మీయనుగ్రహమే కదా? దేవాధిదేవతులందరును మీయాజ్ఞానువర్తులై చరించుచుండ చంద్రుఁడు మాత్రము వ్యతిరేకంబుగ ప్రవర్తించునా? వానికిఁగుండియ లెన్ని?

వజ్ర:—విఱ్ఱవీఁగుచుండిన యింద్రుని నంతటివాని గతి యేమైనదియుఁ దెలియదా! ఇఁకనీతుచ్ఛు లెంత.

భా:—నాథా! అయినను నింతటి యామోద సంధాయియగు చంద్రుని మాత్రము దూఱ—

వజ్ర:—కావున నే భయంబున వాఁడు తనకార్యంబు

లఁ గొఱంత లేక మనమున కెక్క ప్రవర్తిల్లుచున్నాను. ప్రియా నొక్క గీతికం బాడుము.

[అనుబంధము 11.]

వజ్రిభావతి:—[మార్గంబున] శుచిముఖ యింతకుమున్నే ననుదెంచి నన్నిట్టులేని భవజ్జనకునకు నన్నుఁ దెలియఁబల్కుము. తక్కుంగల కార్యంబు సాధింతు' ననియె. దానికిది యే యదును. ఈశరదాత్రియందు సౌధాగ్రంబున వినోదించు చుండు. కార్యము సఫలమగును.

శు:—[పోయి] విజయోస్తు! విజయోస్తు!

వజ్ర:—కుమారీ! రమ్ము కూర్చుండుము. ఇంతవర కెక్కడనుంటివి?

శు:—నేఁడుద్యానవనంబున సంచరించుచుండి నొకవింతఁగాంచితిని. తదాశ్చర్యంబున కార్యంబులన్నింటిని మఱచితిని.

వజ్ర:—ఏమావింత?

శు:—నేనొక్క కన్యామణిం గాంచితిని.

చ॥ *శుచిముఖియంద్రుదానినివ ♦ చోనిపుణత్వమునందు సత్కథా।
రచనలయందు నీతివిదు ♦ రత్వమునందు బహుశ్రవోవలో
కచణతయందు నెందుసరిఁ ♦ గానముదానికి వేయునేలదా
నిచతురతావిశేషములు ♦ నీవకనవ్వలయున్మహాత్మకా॥

అయ్యది భవద్దర్శనార్థమై వేచియున్నది.

వజ్ర:—కొనిరమ్ము.

ప్ర:—చెలీ! రమ్ము.

శు:—[ప్రవేశించి] విజయోస్తు! విజయోస్తు!

క॥ వందనము రాజచంద్రమ!
వందనమయ్యా! సతతము ♦ వందితరూపా!
వందలుగనుగజతురగ
స్యందనములువర్థిలునిల ♦ నసురప రేణ్యా!

వజ్ర:—ఆసీనవగుము. [అట్లేచేయును] సకలలోక సంచారిణివగు నీకెన్నియో యద్భుతంబులు తెలిసియుండును వాని వివరింపుము.

శు:—[విచారించుట నభినయించి]

తే॥ గీ॥ * కనినచోద్యంబు లెన్నియో ♦ గలవువాని
నేమనిచెప్పుదునందులో ♦ నెల్లనాకు
నతివిచిత్రమైతోచిన ♦ యదినిశాచ
రాధిప!. వచింతు నొక్కటి ♦ నవధరింపు.

ఆ॥ వె॥ *నటుఁడొకండుభద్ర ♦ నాముండు మునిశ్రేష్ఠ
కోటతాపస సభ ♦ నాటనేర్పు
వలనమెచ్చఁజేసి ♦ వరముగానత్యద్భు
తంపు నాట్యపటిమ ♦ పెంపువడసి॥

వాఁడిప్పుడు సప్తద్వీపంబులయందును చలియించుచు నాట్యగతుల నెఱపుచున్నాఁడు.

వజ్ర:—శుచిముఖీ! నీయంగలావణ్యమునకుందోఁచునీ వాక్కులు సయితమమరినవి. ఎట్టులేని నాభద్రునిటకుఁ గొనిదెమ్ము. వాని నృత్యముఁజూడ కాబోలు నాచిత్తమ యూరిము నృత్యమాడుచున్నది.

శు:—రాజేంద్రా! సెలవా? [నిష్క్రమించును]

[చతుర్థాంకము-ద్వితీయరంము సమాప్తము]





# ప్రభావతీప్రద్యుమ్నము.

---

[చతుర్థాంకము— తృతీయరంగము—కృష్ణునిగృహము]

కృ:—ఏమి! శుచిముఖి యింకను రాకున్నది?

శు:—[ప్రవేశించి] దేవా! జయము. జయము.

కవిరాజవిరాజితము॥ సరసిజలోచన! సాధుజనావన! ♦ సామజ
పాలనరా!
సురగణవందిత! దుర్జనబంధిత! ♦ శోష
ణపోషితరా!
వరకరుణాలయ! నారదపాలయ! ♦ వాస
వభీతిలయా!
సరసగుణాంచిత! రాక్షసవంచిత! ♦ సజ్జన
రక్షితరా!

[అనుబంధము 12.]

కృ:—శుచిముఖీ! ఆసీనవగుము. కార్యమేరీతి ఫలించె.

శు:—గానవినోదా! త్రైలోక్యపూజ్యా! తెలియనివానిచందంబున నడిగెదవే? భూతభవిష్యద్వర్తమానంబుల నీకెఱుంగరాని దెందైనను గలదా! భవన్మహిమంబునఁగాని కార్యంబొండుకలదా? సర్వమును శుభావహంబు.

కృ:—ఏమి! వజ్రనాభుఁడనుజ్ఞ నిచ్చెనా?

శు:—అంతయు నీయనుగ్రహంబుననే. మఱియొక్క విషయంబు నాకర్ణింపుము.

వజ్రనాభునికొక్క సోదరుఁడు కలఁడు వానిపేరు సునాభుఁడు. వానికిరుగురు పుత్రికలుకలరు. వారికిగద సాంబులు భర్తలుకాఁగలరను వార్తవింటి.

కృ:—మేలాయే! యాదవత్రయంబెట్టులేని కూళురాక్షసు కూలంకషంబుగా నాశంబుఁగావింతురు. ఇది నిశ్చయము. నీవతిత్వరితంబుగఁబోయి శతమన్యునకీ యామోద వృత్తముఁ దెల్పుము.

శు:—దేవా! చిత్తము.

[నిష్క్రమించుచు]

[చతుర్థాంకము—తృతీయరంగము—సమాప్తము.]

———:o:———



# ప్రభావతీప్రద్యుమ్నము.

[చతుర్థాంకము.-చతుర్థరంగము..ప్రద్యుమ్నుని మందిరము]

ప్రద్యు:—ప్రభావతీ! ప్రభావతీ! ఇంతకాఠిన్యహృదయవా! నేనంపిన పత్రిక కుత్తరమే లేదా? పోనిమ్ము.

శుచిముఖీ! శుచిముఖీ! ఎంతకట్టిడిదానవు! అనురాగవృక్షము శాఖోపశాఖా విస్తరంబై ఫలసమన్వితయగుటకు మునుపే మహాదగ్నిదహింపజేయుట న్యాయ్యమా?

శు:—కుమారా! జయమగుగాక! జయమగుగాక!

ప్ర:—రమ్ము. రమ్ము.

శు:—ప్రద్యుమ్నా

సీ॥ * ఒకచిల్క చేతపత్రిక నంచితే నాకు

ప్ర:— అని చితియుదినీకు • నందెనో? కొ

శు:— అనుచునెవ్వరిఁగూర్చి • అదివారికిని జేరె

ప్ర:— నాయింతికిని శుభంబె • హంసరమణి

శు:— నా లేఖయందటు ♦ నామాటయనవచ్చు
ప్ర:— మున్నట్టికోదువరా ♦ మూలమెద్ది
శు:— పత్రికకదుదైన్య ♦ పడినీవుపంచుట
శ్లాకాంతపై నెంత ♦ హాళికలిమి
తే॥ గీ॥ నాసతియుభవద్విరహాగ్ని ♦ సంతకుండె
ప్ర:— నన్ను నెఱుఁగుటయెట్లును ♦ న్వాంఛసేయ
శు:— శివలిఖించి యిచ్చిఁదినీ ♦ చెలువుదాని
ప్ర:— కేమిటనిచ్చె వరుఁడునీ ♦ కతఁడనుచు

ప్ర:—పాపమయ్యది విరహానలజ్వాలా దందహ్యమానమానసయై యున్నది. నిరతము నిన్నే కలవరించుచున్నయది.

సీ॥ నీరూపుమదినెంచి ♦ నిత్యంబునయ్యది
తలపోఁతలకుఁబూని ♦ కలఁతనొందు
కలఁతనొందినటులె ♦ కన్నీరువెసవెస
నించినిట్టూర్పుల ♦ నించుఁజాలఁ
నిట్టూర్పునిగిడించి ♦ నిన్ను తించెడిభాతి
పెదవెలనల్లార్చు ♦ పెల్లుగాను
పెదవలనల్లార్చి ♦ ప్రియుఁజూడలేనట్లు
వదనంబువంచును ♦ వారిజాక్షి!
వదనంబువంచియు ♦ బెదరునలేచును
ప్రిద్యుమ్నయంచును ♦ ప్రాణసఖియ
బెదరునలేచితా ♦ ప్రేమఁగౌగిలిఁజేర
కేల్సాచులేకున్న ♦ నిల్చునట్టె

తే॥ గీ॥ ఎంతజెప్పినచాలదా ♦ యింతివగవు
తుదిపలుకు నాలకింపుమో ♦ సుందరాంగ
మఱచినిద్రించు తఱిఁగూడ ♦ మఱవక చెలి
నీదుపేరుకలవరించు ♦ నిద్రయందు॥

ఉన్మాదినిఁబోలి నానావిధంబులఁ బ్రవర్తిల్లు. ప్రద్యుమ్నా! నీవొక్కక్షణమాత్రము తడసితివేని రజ్జు విషాగ్ని జలంబులఁ బ్రాణంబులవాయు. ఇంతేల. ఇంతులతాల్మి క్షణభంగురములని నేవేఱుగఁ జెప్పనక్కఱలేదు.

ప్ర:—[కలఁతజారిన మనముతో] ప్రేయసీ! ఎంతటికష్టము సంభవించె. ఆరమణీమణిముఖ లావణ్యమును, జూచుటకైన నడిగి రాలేదుగా. ఒక్కవజ్రనాభునికి జంకి నేనిడుములఁ గుడుచుటయే గాక నీకు నయితము పాలుబెట్టితిని. కటకటా! ఎంతపాపిని.

ఛీ! ఏటితలఁపులివి.

క॥ * గ్రక్కునఁజనివానిలుదునా
ఱెక్కలుగట్టుకొనిదివిజ ♦ రిపుమేడలపై
నక్కొమ్మఁజూచుటెపుటెపు
డొక్కోయనునంతతమక ♦ మున్నదిమదిలోఁ

తే॥ గీ॥ * ఏమిసేయుదునాదైత్యు ♦ నియ్యకోలు
లేకవీడెవ్వరికిఁజొర ♦ రాకయునికి
యరసివేగుచునున్నాఁడ ♦ నమరపతియు
హరియుఁదలపోయఁ కార్యమే♦ మయ్యెఁజెపుమ

శు:—ఊరడిల్లుము. ఎతత్పుట భేదనముం జొరమార్గంబొంటు కలదు. తదుపాయంబు భవజ్జనకుండు నిశ్చయించుకొనియున్నవాఁడు. ఇంద్రుఁ డిత్తరికి తహతహఁబడుచుండును. నారాకరాకకై చకోరంబు భాతివేచియుండు. ఇదె శీఘ్రంబున మఱలివత్తు.

[నిష్క్రమించును]

సేవకుఁడు:—[ప్రవేశించి] ప్రద్యుమ్న భూపాలా! శ్రీభగవానులవారు మిమ్ములఁ దోడి తెమ్మన్నారు. [పోదురు]

[చతుర్థాంక చతుర్థరంగము సమాప్తము.]







# ప్రభావతీప్రద్యుమ్నము

---

[చతుర్థాంకము-పంచమరంగము-కృష్ణుఁడొంటిమై కూర్చుండి యుండును.]

ప్రద్యు:—జనకా! జయము. జయము.

కృ:—కూర్చుండుము.

దేవా! గదసాంబులు భవదాజ్ఞానువర్తులై వచ్చియున్నవారు.

కృ:—త్వరితగతిం బ్రవేశపెట్టుము.

నే:—ప్రసాదము.

గదుఁడు—సాంబుడు:—అభివాదనంబు.

కృ:—కూర్చుండుడు.

ప్ర:—అయ్యా! బిలువఁబంచిన కార్యమెయ్యదియో యడుగనగునా?

కృ:—కుమారా! నీవడుగుటకనే దెలుపనెంచినాఁడ. వజ్ర నాభుండును రక్కసుం డొక్కండు విరించినిగురించి చిరకాలం తపంబాచరించి వరంబుల నొంది క్రొవ్వి కన్నుమిన్నుఁ గానక దేవానీకముఁ గాతించుచున్నాఁడు. పురందరుఁడా పాటుల కోర్వంజాలక మొఱఁబెట్టుకొనియె. నేనప్పుడభయప్ర దానంబుఁగావించియున్నవాఁడ. అప్పట్టణంబేరికేనిఁ జొరనల వికాదు. కాని దానికొక్క సాధనంబుకలదు. భవద్పితా మహోధ్వరంబున నాట్యరీతులఁ బచరించి మనల మనఃప్రమో ద ముదితులంగావించినది మఱువరుకదా? వానివృత్తాంత ముఁ బూసగ్రుచ్చినభాతి శుచిముఖి వాగమృతధారలచేఁజెంచి వజ్రనాభునికి విన్నవించినది. వాడందుల కాశ్చర్యనిమగ్నుం డై వానినెటులేనిఁ గొనిదెమ్మనెనట. మీరలిప్పుడు నాయా నతిఁదలదాల్చి భద్రికరూపంబున నాపురిజొచ్చి వానిఁబరిమా ర్పవలయును. కుమారా! ఈవు భద్రికరూపంబు ధరియింవు ము. గదసాంబులు పారిపార్శ్వక విదూషకులై సాయపడెదను.

ప్రద్యు:-అంతయు భవన్మహిమయే. [నిష్క్రమింతురు]

[ఇరువురుస్నేహితులు ప్రవేశింతురు]

మొదటివాడు:—అబ్బా! ఇంతకాలానికొక్క మంచి వార్త.

రెండవవాడు:—ఏఁటిదోయి! మన ప్రభువుల పద్దయ్యే కు పెండ్లఁటరా?

మొ:—ఇనోయి! నిన్న మనసామివాళ్లను వజ్రనాభుని పూరికి పంపినాడఁట.

రెం:—వాళ్ళంటే ఎవరోయి! ఎంతమందో?

మొ:—యువరాజు-గదుఁడు-సాంబుఁడు.

రెం:—అయితే కొంపకూలింది- నిష్చయం.

మొ:—అబ్బే! ఏమోయి! ఆలామాట్లాడుతావు.

రెం:—మనకొంపకాదోయి! రాకాసిగాని కొంప కూలుతుంది. వానిదుంప తెగుతుంది.

మొ:—యిదేనయ్యా! మంచి.

రెం:—ఇంకేమిమనకు తక్కువ. చక్కగా భోజనం పడుతుంది. ఇనాం గినాం బలంగా చిక్కుతుంది.

మొ:—ఇంకెల్ల దాము రావోయి.

రెం:—బలే మాటోయి. అబ్బా! పొట్టనిండిందోయి! బలే చెప్పావయ్యా!

[ఇది విష్కంభము]

[పంచమాంకము-ప్రథమరంగము-సునాభపురీ నాట్యశాల]

[ప్రభావతి యంతఃపుర వాతాయనంబునుండి చూచుచుండును]

[అనుభంధము 13.]

వజ్రనాభుఁడు:—మేలు! మేలు! నటుఁడా!

శా॥ *గాంధారప్రముఖస్వరశ్రుతికళా ♦ గంభీరవారాంగనా
గాంధర్వంబు ఘనస్వరంబుతతని♦క్వాణంబువంశాదిసం
బంధస్వానపరంపరామహిమయుక్ ♦మద్దెళ్ళదిందింధిమిం
ధింధోక్కిధిమిక్కిశబ్దభరముక్ ♦దీపింపనాపూర్ణతన్॥

నీవు గావించిన నృత్యమెంతయో చక్కఁగానున్నయది మఱికొంత నేపాడుము.

[వాతాయనద్వారంబునఁ జూచుచుండిన ప్రభావతింగాంచి ప్రద్యుమ్నుండు]

ప్ర: చ॥ *సకలవిశేషశోధనకుఁ ♦ జాలినయోనెఱజాణవ్రజనా
భకులవతంసరత్నమప్రి♦భావతిరోహితకంటకంబుతా
వకమగుమాపునాపయిఁబ్రవర్ధితరాగతఁబర్వఁగానన
త్యుకలుషవృత్తినాసుకృతి♦యంతయునేఁడుసుమీ
ఫలించుటల్

వ:—బలేబేషు. సహాభాష్. ఇంకొక్కటిఁగానిమ్ము.

ప్ర—కం॥ * ననునేలికొనుమవశ్యం
బుననీయూడిగముచిత్త ♦ మునకెక్కఁగనే
నొనరింతునేఁటితమినీ
మనమునరొతయు నిడుకొని ♦ మన్నింపఁ
దగున్॥

వ:—నటుఁడా! మేలు మేలు. నేటికింకనాట్యంబు చాలించి కడునలసియున్నావు. కావున శ్రమపరిహారార్థము నేదఁగొనుఁడు.

[పంచమాంక ప్రథమరంగము సమాప్తము.]





# ప్రభావతీప్రద్యుమ్నము.

---

[పంచమాంకము - ద్వితీయరంగము - సంధ్యాసమయము.]

[చెలులు - ప్రభావతీ కూడియుందురు.]

శుచిముఖి:— ప్రభావతి! ఎంతభీరువేనీవు. కపోలంబుపై కరముఁ దీయుము. భయంబుడుగుము. నీప్రియుఁడు బల్కిన పద్యంబులకు రెండర్థంబులుఁగలవు. అంతరార్థమిందేమియో. దెలియునా? జీఁకటిపడిన చిలుకకులాయముంజేరును. దానదాని జన్మము చరితార్థమగును.

[అనుబంధము 13.]

ప్రభా:— వజ్రనాభకులవతంస రత్నమ ప్రభావతి యంచుఁబల్కుఁడా? మజ్జనకునకయ్యది దెలిసిన నేలాటివిపత్తు కలుగునోకదా?

శు:— ఎంతజెప్పినను మఱి మఱి కలఁత జెందుచున్నావు. నీమనోహరాంగుని వాక్చతురత దెలయుమింజేసి

నీవిట్లాడుచున్నావు. ఆతఁడప్పద్యంబులందర్థ ద్వయంబుల నూహించి చెప్పెను. అందు సభాదినాథుఁడగు భవజ్జనక స్తవంబుగను నిన్ను వేడుకొను విధసంబునను బల్కియున్నాడు.

మొదటిసఖి:—ఊరకకలఁతయేల? అదిగో కనుఁగొనుము. సూర్యభగవానుండిదె యస్త్రాద్రి కేగుచున్నాడు. [తమ్మి నుద్దేశించి.]

చ॥ కరములుసోకినంతనెయ ♦ కారణమోదము నొందుపద్మినీ!
కరమలరారు జృంభతనుఁ ♦ గాంచునినుండు దిగంత
మంతటన్
బిరబిరనందవచ్చినగ ♦ భీరతకట్టుదు వీవునాళమున్
వరకవిమైనఁ జాలునెయ ♦ వారితజాణతనంబు చాటగన్
విరహఁపుబాధనీవిటు ♦ విన్నదనంబును జెందతీర్చఁదా
పురుపునఁ గ్రుంకివచ్చునదె ♦ వాఁడురసాంచితనీదె
భాగ్యమా

రెండవసఖి:— ఇటుజూడుము!

క॥ * తోరఁపుజీఁకటులిప్పుడు
మారోత్సవకలనమునకు ♦ మదిఁబొంగుచుది
జ్ఞారీజనులాడెడిక
స్తూరివతంసములయొప్పు ♦ చొప్పడనెరసెన్.

మూడవసఖి:— చెలులారా! ఈవంకఁ దిలకింపుడు. మందారమాలికలట్లు నక్షత్రరాజియెంత పరిభాకరంబుగనున్నదో,

అల్లదిగో! కంటిరే! యామినీధవుండల్లన మెలచుచున్నాడు.
[తమ్ముడుద్దేశించి]

చ॥ కువలయనాథుఁడీగతినిఁ ♦ గుల్కుచు రాగ కొంత లేటికే!
నవనమదద్విభూతిమన ♦ సారఁగగల్గెను నీకునోముని
దివమునసుండినీకునును ♦ ద్విపరుఁడాతఁ డోసంగుచిత్పృధ
జవమునినాని సంతసము ♦ జాలమునుంగు మొకింతకల్వరో!

4:— కన్నుల పండువఁగావించు నీచందన శీతల చంద్రికయు నక్షత్రరాజియు మఱింతవింతఁ గొల్పుచున్నది. ప్రభావతికింక కైసేతసేయంగవలయు.

రాగపల్లరి:— చెలులారా! కనుగొనుఁడు. ఇయ్యామినీ పూర్ణశశాంకవదన నయ్యామినీ పూర్ణశశాంకుఁ బరిహాసించుచున్నది.

చ॥ * విరిసిననొక్కయొప్పునర ♦ వీడిననొక్కయొప్పుజిక్కువా
టొరసిననొక్కయొప్పునది ♦ యూడ్చినవేఱొకయొప్పు
వేణిభా
వరచననొక్క యొప్పుముడి ♦ వైచినవేఱొక యొప్పు
కొప్పుగాఁ
బరఁగిననొక్క యొప్పుఁగను ♦ పట్టకమానదు నీకచం
బులక

ప్రః— పిట్టయాందోళన మొందుచుండ చూచుచున్నారే

శా॥ *రాఁడయ్యెన్ హృదయేశుఁడీహృదయభా • రంబెల్లుసె
తుఁ తుణం
బేఁడై యున్నది యేటికిందడసెనో • ఏవిఘ్నముల్పట్టెనో
నేఁడేతెంచు ప్రయత్న మున్న నకటా • నీతోడఁ జెప్పండెయె
వ్వాఁడీరీతియొకింతగనోయపుడున • వ్వారుద్విచ్చినట్లాడఁగన్
నామీఁది యవ్యాజప్రేమం జేసి యట్టుఁ బలికెఁగాదె!

శుద్ధాంతకాంతాళిం జూడఁగాదనుమాట మఱచెకాఁబోలు. అందునిది పోఁతుటీఁగకైనను చొరరానిది.

మృగతృష్ణబోలె నాసఁగొల్పి లేనిపోని హృదయసంతాపంబును మఱింత మిక్కుటముఁగావించె. అక్కటా! మగవారిమాటల నమ్మవచ్చునా! ఎన్నంటికిని నమ్మరాదు.

నేనెంత వెడఁగుమతిని! యేమేమో వదరుచుంటిని. దౌర్భాగ్యురాలనగు నన్ను నేనిందించుకొనుటకు మారుగా నామనోవల్లభుఁ దూల నాడుచుంటిని.

లోకంబునఁ దరివేచియుండి మిత్రులు సహితము శత్రులై దుఃఖార్ణవనిమగ్నులంజూచి జాలిఁగొనక మఱింతముంచఁ జూచుచుందును.

[చంద్రునుద్దేశించి] ఓరీకువలయబంధూ!

క॥ చందనశీతలుఁడని హృ
న్మందిరతాపమడఁపంగ • మదినమ్మిననిన్
సుందరులవెతలముంచుట
చందురుఁడ! ధర్మ్యమ్మెనీకు • సరిచూడంగన్

ఉ॥ పుట్టితివీవుక్షీరధిని ♦ పుట్టినదాదిదయాంతరంగతోఁ
బుట్టువులక్ష్మిసింగలసి ♦ పొందితిసర్వశుభంబులన్
జెట్టలఁజంపువెన్నుఁడున ♦ చేరినబంధుఁడునీకుఁజూడఁజేఁ
బట్టితివీవురోహిణిని ♦ భాంగవధూటినిసుందరీమణిన్
ఇట్టిదయాంతరంగులిల ♦ నిందరుబంధులుగాఁగనేగతిన్
కట్టిడిమార్గమబ్బెనయ ♦ కాంతలపై నిటులుండఁ
బాడియే?

ఓరీ! సీ॥ చంద్రకాంతములపైఁ ♦ జల్లుచల్లదనము
సూర్యకాంతములపైఁ ♦ జూపవేల
కువలయములఁగల్గు ♦ కూరిమితోడను
తమ్మిపూగ్గములను ♦ దనుపనేల
రాత్రులపైఁజూపు ♦ రాగవిశేషము
దినకాంతపై నేల ♦ ద్రిప్పవీవు
వెన్నెలపులుఁగుపై ♦ విదజల్లుప్రేమను
సారసములయందు ♦ పరుపవేల

తే॥ గీ॥ ఎంతపక్షపాతివిగోరి ♦ యిందుఁడౌర!
అలకళంకమ్మునొందదె ♦ యందువలన
తగవెనీకనుచంద్రుఁడ! ♦ తరుణులయెడఁ
జులుకుఁజూపియుమిక్కిలి ♦ సొక్కఁజేయ
[మలయమారుతు నుద్దేశించి] ఓరీ!

తే॥ గీ॥ చల్లదనమొకించుకయున్నఁ ♦ జలికరువము।
శిలనుఁబోలిమునీవిట్లు ♦ స్త్రీజనంబు

గాసిఁబెట్టుటపాడియే ♦ కరుణలేక
మిత్రులేశత్రులైనచో ♦ ప్రేమయున్నె?
ఇట్టిమంద ప్రకృతితో మొఱఁబెట్టుకొన్న లాభమేమి?
ఆహా! ఈదీనురాలి మొఱలాలకించు వారెవ్వరునులేరు కదా? నాజీవితేశ్వరుఁడే పనిబూని పరీక్షించినచో నబలనగు నేనేమిచేయనగును. ఇఁకనెవ్వరిఁ బలుకరింతు. అన్యథాశరణం నాస్తి. త్వమేవశరణం. త్వమేవశరణం.

[మన్మథునుద్దేశించి.]

ఉ॥ *భూనుతలీలరుక్మిణికిఁ ♦ బుట్టిమనోభవమత్ప్రియుత్వముల్
బూనినవాఁడవీవయఁట ♦ పూర్వఁపునీయతనుత్వధర్మముల్
మానకయేఁచుచున్నది ♦ మామకభాగ్యమునిన్ని
టాడఁబోఁ
గానెటువచ్చునోతడవఁ ♦ గావెటతుల్ కరముల్మొగిడ్చెదన్

ఏనింకభరియింపఁజాల నిదె! రజ్జువిషాగ్నిజలంబులనైన ప్రాణంబులవాసి జన్మాంతరమునైన నాకామ్యవస్తువునందుదుగాక.

మగలవంటి కఠినాత్ములు మఱొక్కరుండఁబోరు. శోషించి చూపరియున్న పాదపంబునకమృతధారవోలె నొక్కలేఖవచ్చె.

అయ్యది వచ్చినాకు మఱింత దుఃఖమతిశయింపఁజేసె. అక్కటా! ఇఁకనేనేమిచేయుదాన.

[అనుచుఁ బూబొన్పన ఖిన్నవదనంబునఁ గూర్చుండును.]

ప్రద్యుమ్నుఁడు:— [తటాలున ప్రవేశించి] క్షమింపుము. క్షమింపుము. రమణీలలామా! మనోహారిణీ! మోహాంధుఁడనై! ఇదె నిన్నింతఁ గాసించిన, వెతఁబెట్టిన, అలయించిన, విషమపరీక్షలముంచిన, కాఠిన్యహృదయుండు, శతారతుల్యుండు, పాపి ప్రద్యుమ్నుండు.

అకటా! ఏమి నా పేరియసి కృపాంగపలోకనంబుల నాపైఁ బఱుపదు. మాటాడదు. ప్రభావతీ! ప్రభావతీ! భవదీయ ప్రభావరుచుల నాపైఁ బ్రసరింపఁగూడదా?

శుచిముఖీవాక్య బీజంబు మదీయ హృదయ సస్యంబున నాట నందు భవదీయాను రాగాంకుర ముద్భవిల్లి యల్లిబిల్లిగా నల్లుకొని నేటికి ప్రసవవతియై ఉమ్మద్సందర్శనా ఫలంబును విడిచె. ఏతత్ఫలలాభంబు నాకు లభ్యంబు కాకపోయె. కట్టా! ఇట్టిపాషండ మనస్కునికి ఇట్టి నిర్దయామతి ఇట్టిసంశయమానసునకు ఇట్టి నారీలలామం బబ్బునే?

[ప్రభావతివంకఁజూచి] ఔరా! ఏమి చెలువంబు.

[అనుబంధము 16]

సీ॥ అలివేణిచలమూని ♦ వలతేని వెలయంగ
నలవుమైనలయించి ♦ వెలయుఁజాల
వగలాడిబగబూని ♦ తొగతేనినెగయంగ
సగమ్రుమైతగఁద్రుంచి ♦ నయముమొఱయు
వరవేణిభరమూని ♦ నెఱిపేగిసరముమై

పురుడించి కరిమూకc ♦ బఱువఁజేయు
మదనాంగి మదమాని ♦ సదమలతుమ్మెద
కొదమలముదమారc ♦ బందుఁజేయు

తే॥ గీ॥ సతులకునుమిన్న నెతనించు ♦ లతలఁజాల
ఈలలనఁజూడమదిలోన ♦ వలఁపుదగులు
హృదయరంజనమునుగాంచి ♦ అదునుమిడిచి
నాగరాజంబుపోవునే ♦ వేగఁదాను॥

అకటా! ఏమున్న నేమి. ఒక్కమాటైనను పలుక
రింపదమ్మె. వేడికొందును.

సీ॥ తోడివారలనైన ♦ తొంగిచూడకనీవు
వగవంగనీరీతి ♦ తగునెభామ!
మోహనాకారిణీ ♦ ముఱిపంపుచిఱునవ్వు
ప్రసరింపకుండుట ♦ పాడియగునె
కల్యాణినీవిటు ♦ కాంతునిఁజూడక
వదనంబువంచుట ♦ పాడియగునె
హంసధ్వనినిబోలి ♦ యలరెడి పలుకుల
మఱుఁగుజేయుటనీకు ♦ మాన్యమగునె

తే॥ గీ॥ మధ్యమావతిరోనిన్ను ♦ మఱచుటెట్లు
ఇంతనిర్దయునింతటి ♦ యెక్కసంబు
ఇంతకాఠిన్యమునుయీవు ♦ యిపుడుజూప
పాడియేభామలేలెమ్ము ♦ పంతమేల॥

శుచిముఖి—రాగవల్లరులు:- [పరికించి] ప్రద్యుమ్నా! ఏమీరీతి నిశ్చేష్టితుఁడవై యున్నావు.

ప్రద్యు:—ఇందు నాతప్పేమియున్నది.

శు:—రాగవల్లరీ యందేదియో ధ్వనియగుచున్నది. చూతముపద. [ప్రభావతి పదవ మెత్తి జూచును]

ప్రద్యు:—ప్రేయసీ! లజ్జవీడుము.

ప్ర:—నాథా! మన్నింపుము.

[పంచమాంకము—ద్వితీయరంగము—సమాప్తము]

---

[పంచమాంకము-తృతీయరంగము-ప్రభావతి నిలువుటద్దముచెంత నిలువంబడియుండుట]

శుచిముఖి:—[పరికించి] చెలీ! అందము బాగున్నది లేవే! అయ్యో! నెంతయాసక్తి యోమఱింతజూడుము.

ప్రభా:—[గిరక్కునఁదిరిగిజూచి] చెలులారా! రండి.

రాగ:—ప్రభావతీ! అదియేమే? పద్మపుఁగాంతిని భృంగము భంగముజేసి మకరందధారల గ్రోలినట్లున్నది.

ప్ర:—ఏమేనీ వాక్చాతుర్యము!

రా:—నా వాక్చాతుర్యమేమున్నది. కనుగందినదళములు నడయాడు నాళముఁగాంచిననే తమ్మి ముదితమైనట్లున్నది.

శు:—అది యట్లుండనిమ్ము. మజ్జనాదివిధులకు.

తే॥ గీ॥ * నీవుతడయుటచోద్యమా • నీరజాక్షి!
ఘనముకాఁబోలుశ్రమమట్లు •గాకరతుల
చిన్నెలింపునఁజూచుకొం • చున్నదాన
వేమొవిఘ్నమైవచ్చితి • మెఱుఁగకేము॥

[ప్రభావతియుంచు చంద్రవతి గుణవతులు ప్రవేశింతురు]

చంద్రవతి:—అక్కా! కంటివా? చంద్రికయెట్లు చిందులు ద్రొక్కుచున్నదో! చకోరము తృప్తినొందెనుకాఁబోలు. చంద్రుడెట్లు తనకాంతుల నిట బఱుపఁగలిగె. ఇయ్యది కడుం గడు చోద్యంబు.

రా:—చంద్రికచొరరాని చోటొక్కటిగలదా? మీపై గూడ బడును.

ప్ర:—మీరివృత్తాంతమేమి?

శు:—చెప్పఁటేల?

ప్ర:—చెప్పకున్న నాయాన సుమీ!

శు:—వి శేషములేమియుఁ గానరావు. కాని పురుషభూతద్వయం బావరించినది.

రా:—ఇందునందరు దొడిదొంగలే.

ప్ర:—నేము చరితార్థులగుదురుఁ కాబోలు.

[పంచమాంకము—తృతీయరంగము—సమాప్తము.]

[పంచమాంకము - చతుర్థరంగము - శయనగృహము.]

[ప్రభావతి కోపముతో నుండును.]

[ప్రద్యుమ్నుఁడు వచ్చుచుండఁ దెరలో] ప్రద్యుమ్నకుమారా! ఆగు ము. నీప్రేయసి కోపావేశయై యున్నది.

ప్ర:— హా! ఏమిది! నేనెంతయో యాతురముగాఁ జొచ్చుచుండ నిం దెవ్వరో యాగుమనుచున్నారు. కోపావేశ యై యున్నదని పల్కుచున్నారు. ఏనెట్లు లీపలుకుల విశ్వసింతు నిన్నటి దినంబున నన్నానంద సాగరంబునఁ దేల్చిన నాప్రేయసి నేఁడేలకినుకఁ బూనియుండును. ఏనేమైన మఱచి మత్ప్రాణరతి నామముచ్చరించితినా?

[యోచించి] తెలిసెను. తెలిసెను. అదియే కోపకారణము. ఇంతులతాల్మి యింతయే కదా? నామోచ్చారణ మాత్రంబున నీసువహించినది. ఏమిది! సకలగుణ రత్నాకరయు, మన్నేత్రంబుల కంజనశలాకయు, నాదేహమునకు చందన చర్చయు - నాసౌభాగ్య లక్ష్మియునగు ప్రభావతి యింతటి వెఱ్ఱి యగునా? నమ్మజాల అయినను పోయిచూచెద. [ప్రభావతిఁ గాంచి] ఔరా! తలఁచినదెల్ల నిశ్చయమైనది. [దీనముగా] ప్రభావతీ! నావలనం దప్పులేవైనం గల్గెనా? లేక నన్బరీక్షింపనెంచి యీరీతిగా వించితివా? నిష్కారణముగ గోపంబుఁ బూనఁ జాడియే? తప్పులున్న నావలి నసోద గొనుమా?

ప్రభా:— అనఘా! నిన్ను సోదగొనునంతటి దాననా నేను? నేరతినిగాను! రతియన్ననంతకుఁ జాలినది. నాకెక్క

డినుండి యంతటి సామర్థ్యంబువచ్చు దానిచెంతకుబొంము. ఊరక కన్నుదుముపు మాటలేల.

ప్రద:— ప్రభావతీ! కలుకుటమ్మలఁబోలి నాడెంద మును జీల్చివైచుచున్నయవి.

క॥ * పలుకవొకింత యునాతోఁ
జిలుకవుకరుణామృతంబు ♦ చినుకొకటియులో
నులుకవు నాదగుదైన్యపుఁ
బలుకవగణమున వినుచుఁ ♦ బద్మదళాక్షి!

నిన్ననుటలో లాభమేమి నీవంగసమ్మతిదికదా.

క॥ *దానవునకును దయించిన
దానవుగావునలతాంగి ♦ దయచాలదునీ
మానసమునసీవిలఁ బ్రభ
మానసమస్తోరుగుణస ♦ మంచితవైన౯

ప్రభావతీ! కనికరింపుమా!

ఉ॥ *రాఁగదెయోసుధాంశుముఖి! రాఁగదెయోకఠినోన్నతస్తనీ!
రాఁగదెయోవిలాసవతి! రాఁగదెయోకలకంఠభాషిణీ!
రాఁగదెయోకళావిదుషి! రాఁగదెయోకలహంసగామినీ?
రాఁగదెయోగుణైకనిధి! రాఁగదెయోలలితాంగిడగ్గఱ౯

క॥ * కలికీ! రాఁగదెచిలుకల
కొలికీ! రాఁగదెలతాంత ♦ కోదండునిపూ
ములికీ! రాఁగదెయూరక
యలికీ! రార్చటులనేల ♦ యలఁచెదునన్ను౯.

[ఆలోచించి] ఏమిది! నావిడిదవాఁకిటఁ బ్రాభోదికంబులగు ఘాద్యారవంబులు నావీనులకు ... నున్నవి. వజ్రనాభునిసేవకులు నాకై వేఁచి ... లు. ఇదెపోయెద. [నిష్క్రమించును]

• ప్రభా:— ఔరా! ఏనెంత వెడఁగుపనిఁ గావించితిని. దురాగ్రహంబునుబొంది నాథుంపుబతి మాలుకొన్నను పలుకనైతి. ఈమనోవ్యథ భరియింప నావలన సాధ్యంబుగాకున్నది. ఇదిగో! అనురాగ సూచకముగా నాతఁడంపిన శుభలేఖ. ఇందాతఁడు శుచిముఖి వెంతివేసుకొని యున్నవాఁడు.

ద్విరదగతిరగడ.

*ఓహంసినీచేఁత నున్నయది నాబ్రదుకు
నాహృదయమింతి డెందమునేకముగనదుకు
కరుణనిదిపదివేలు కమ్మఁగై కొనుము
పరగసతితోడ నాపలుకుగానిటనుము
విద్యున్నిభాంగిరో వినుమునికృపఁగన్న
ప్రద్యుమ్నుఁడను పేరు ఫలితమగునా కెన్న
ఏణాక్షివినుమునీయు పేఁకు నా చెవిఁబడినఁ
బ్రాణంబుహరియించు విరులావార్తవెంబడిన
నీమోవిచిగురుతేనియఁ గ్రోలెడినాన
నీములకనవ్వువెన్నెలచలువఁ గొనునాన
నీమృదుకపోలసన్నిధిని మోమిడునాన
నీమోహనశ్రేణినిమురఁ గలిగెడినాన

11

నొడలిలోఁ బ్రాణవాయువులు నాకిందాక
వెడలకుండఁగ నిట్లువిన్నవించెదగాక

యింతటి దయాంతరంగుని - స్నిగ్ధమానసుని - పరిశు ద్ధహృదయుని నిష్కారణంబుగ నలయించుట. ఇఁకనైన చుట దుర్భరము.

[పంచమాంకము - చతుర్థరంగము సమాప్తము.]

---

[పంచమాంకము - పంచమరంగము - వజ్రనాభుఁడు.]

వజ్రనాభుఁడు:— [కోపముతో] కట్టా! కాలవక్రత యిదియేనా? అవివాహితయగు నాపట్టిగర్భము ధరియించుట దానిచెలియండ్రు చంద్రవతీ గుణవతులు పుత్రవతులగుటయు జూడ నామదికూరటలేదు. చండాలుఁడు విష్ణుఁడు - గిష్ణుఁడు ధైర్యమున్న సన్నిధిఁజేయుండరాదా? దీనికై నటరూపంబున ప్రద్యుమ్నునిఁ బంపవలయునా? చించిచెండాడెద.

[అనుబంధము 17] [పోవుచుండును.]

[ప్రద్యుమ్నుఁ డెదురుపడును.] వజ్ర:— ఔరా! వెదుక బోయినతీగ కాలదగినట్లును - ఆడఁబోయిన తీర్థమెదురైనట్లును ఈచండాలుఁడుచేఁ జిక్కినాఁడు. వీనిపుక్కణచెద. నాకుఁగల్ల వరంబుల ప్రసాదించిన కంజాసనునకును దొంగమైచను దెంచిన నీకునుబుద్ధిఁజెప్పెద.

కవిరాజవిరాజితము॥

ఎటులనుజొచ్చితి యానతిలేకను ♦ ఈవుట భేదనము౯
కుటిలుఁడవీవనుచుయీపురిఁజేరియు ♦ కోములిఁజెందితివే
కటుకుననీదగుశ్రొవ్వడగింతును ♦ పారకనిల్వుమరే
కుటిలఁ వుబ్రహ్మను దొంగవరంబుల ♦ కోసముకూల్చెదనే

ప్రద్యు — కవిరాజవిరాజితము॥

పదరకనిల్వునిశాచరముష్కర ♦ పంతమదేలకరే
ఎదురగనిల్చిమగంటిమిపోరుము ♦ యిప్పుడెనంపెదనే
మదమునబ్రహ్మయురుద్రుఁడువచ్చిన♦మార్గణజాలముచే
కదనముఁదాకియుకూల్చెదవారిని ♦ కావనమెందుకరే.

వజ్ర:— [అనుబంధము 18]

ప్రద్యు:— [అనుబంధము 19.]

వజ్ర:—దుర్మదాంధా! ఊరక ప్రేలకుము. ధైర్యమున్న చో నిల్చిపోరుము. మగవాఁడ వనిపించుకొమ్ము.

[అనుచుఖడ్గముఁ ద్రిప్పును - ప్రద్యుమ్నుఁ డస్త్రము వే యును వజ్రనాభుఁడుకూలును.]

[పంచమాంకము - పంచమరంగము - సమాప్తము.]

---

[పంచమాంకము - నాఱవరంగము.]

[ప్రభావతీప్రద్యుమ్నుల వివాహము]

మంగళము.

## తోదకవృత్తము.

జయజయనీరద ♦ శ్యామలగాత్రా!
జయజయపాలిత ♦ సామజపాత్రా!
జయజయరంజిత ♦ చారుకళత్రా!
జయజయసన్ముని ♦ సంఘచరిత్రా!
జయజయమాధవ ♦ జన్మపవిత్రా!
జయజయతర్గ్రణ ♦ సాధితగోత్రా!
జయజయరాక్షస ♦ సంహారసూత్రా!
జయజయసద్గుణ ♦ సంయమిమిత్రా!
జయజయశోభన ♦ సారసనేత్రా!
జయజయనాట్యృత ♦ ఝుంజణపాదా!
జయజయభోదిత ♦ జ్ఞాననివేదా!
జయజయమోదిత ♦ జానకినాథా!

అనుబంధము 20.

సంపూర్ణము.

ఓంశ్శాంతిశ్శాంతిశ్శాంతిః



# Appendix.

## అనుబంధము.

సూత్రధారుఁడు—[కృపారామ]

ప॥ ఓహో! ఇదేమి చోద్యమయ్యో సాహసంబు రాఘ
వా! రాఘువా! రాఘువా!

అ॥ ప॥ దేహతాపజన్మమెల్ల ♦ దెల్పలేక మాధవా!
మాధవా! మాధవా!

చ॥ ప్రపంచనాట్య చోద్యములను ♦ పలుకఁగొనుచుమూర్ఖులై
మూర్ఖులై

శపింపరైరిమోహములను ♦ చాలనిన్నుదెలియకఁగోలు
వకఁ

నీదుపాదములనెనమ్మి ♦ నేజేయుస్తోత్రముఁ పాత్రముఁ
ఆదరించిబ్రోవుమయ్యా! ♦ ఓదయా! శరణిదేకోనుమిదే

అనుబంధము. 2—ఇంద్రుఁడు పే 2.

[కాంభోజి — రూపకతాళము.]

ప॥ ఆహా యీపురి ♦ అలకాపురికన్న మిన్న

అ॥ ప॥ సాహసమొప్పఁడు ♦ మోహముగల్గఁగ ♦ దేహ
తాపంబులదీర్చఁగకల్గిన ఆ॥ హా॥

చ॥ చండకిరణంబులు ♦ మండన ♦ మందున
నిండగజాలెడి ♦ కొండలరీతిని

దండిగమేడలుమా ♦ ర్గాంచునియంచెపు ॥అహా॥
మేటివనంబులు ♦ కోటలు తోటలు
వాటముమీాజ ♦ గవాటవుచిత్రముల్
మాటిమాటికిని ♦ మనమునకచ్చెరువ్వగ ॥అహా॥
చిల్కల ♦ పల్కులు ♦ కుల్కుచునొవ్వచు
దళ్కుల ♦ యల్కుల ♦ కొల్కులఁగల్గియు
పుల్కరింపుచు ♦ యీాపోర్లునకన్గొన ॥అ॥ హా॥
అనుబంధము 3 ఇంద్రుఁడు పే 4.

[మోహన - ఆది]

ప॥ ధాతాధిపాశరణిదే ♦ దానావాంతకా।
యేతీరునభవాములా ♦ యీాడేరుదునేచాలా

చ॥ చేతోసుగభవశీల ♦ ఖ్యాతిగొనుమీావేళ
అమరపురంబును ♦ ప్రేమతోఁజూడను
యీామహిజన్మము ♦ వెత్తినసీదయను
స్వామినేవేఁడెదఁ ♦ సౌఖ్యమునొందను
భూమిజపైగొను ♦ ప్రేమనుజల్లుమిక ॥ధా॥
అనుబంధము 4 భద్రుఁడు పే 7

గేయము॥ ఘనుండవై సురధనంబు నందనవనంబు గాచినపాలనా! వినంగమేమిటు కనంగమాయల జనించుచుం డుపావనా! మనంబునందున ప్రపంచరక్షణజనింపగా వరిశీల నా!ఘనంబు ధర్మముదలంచి జన్మముజనించు దేవకినందనా!

[అ 5 ఇంగ్లీషునోటు - ఆది]

నందగోకులబాలా యిదిగో ♦ వందనంబుల గైకొనరారా
పొందుగనీచరణములఁ - ముందుగనే - పూజింతూ ॥నం॥
యిందీవరాలోలా - బృందావనబాలా
డెందమునఁగామా - నందముతో మఱి మఱిఁ బిల్చెద - నాతని
తో ॥నం॥

అనుబంధము 6 భద్రుడు.

బాపనయ్యలారమీకు ♦ భద్రమయ్యెడిఁ
పాపములనుఁబారదోలు ♦ రూపమొత్తియుఁ
జ్ఞాపకార్థముగజేయు ♦ జ్ఞానవంతులై
శాపకారణముల ♦ సమయజేతురా ॥బా॥
మీప్రాపువొక్కినాను ♦ పాలింపరే
ఏపుమీరనాదునాట్య ♦ మెంతయో
జూపులంజూచినన్ ♦ కృతార్థుఁజేయరే ॥బా॥

అనుబంధము 7 శుచిముఖి [దేవీమీనాక్షి] పే 15.

ప॥ దేవామహానుభావా ♦ ధీవరావిభవా

అ॥ ప॥ కావరాయికవిద్యాభవ ♦ కైవల్యధీప్రభావ ॥దే॥
శ్రీవరాహరేవైభవ ♦ సేవకాస్తుతాపరిణావ
పావనాధరరమ్యమొదవ ♦ భవ్యనామసతోష్యదవా
దేవతకారణపూర్ణవ ♦ దివ్యరూపకరసంభవ
తారకాదిమంత్రోద్ధార ♦ ధారణాక్రియావతార
శౌర్యరూపసముగభీర ♦ సర్వలోకనిర్విచార
ద్వారకకృష్ణవతార ♦ దయతోఁబ్రోవగరారా

అ 8 శుచిముఖి పే 16.

శ్రీమహిమాసర్వ ధిపనామా శ్రితపరనయఘన సిరినుకపాదా.
శ్యామలవర్ణా సామజపాలా సనకసముని జనసదయులపాలా
నేమముతోడఁ నీకృపఁజూడఁ నిరతముగొలిచెదని యమతి
తోడఁ

ప్రేమతో రారా! కోరికలీరా! ప్రియముగగఁ విని ప్రియ
మగురామా.

అనుబంధము 9 ప్రద్యుమ్నుఁడు పే 28.

నాథనామక్రియ - ఆటతాళము.]

ప॥ కల్గునొకల్గదో ♦ కాంతనుకన్గొన

అ॥ ముల్కులఁబోలిన ♦ మోహప్రవేదన
కల్గగయోర్వఁగ ♦ గాననుయూహను ॥క॥

చ॥ మందమారుతము ♦ నింద్యముదూష్యము
ముందరసుందరి ♦ మోహముఁవీక్షింప ॥క॥

అనుబంధము 10 ప్రభావతి పే 33.

[వసంత - ఆది]

ప॥ ఎంతవింత యెంతసొబగు ♦ యేమఁందుబింబముఁ
సంతసంబుమంతెనమున ♦ వింత బొపెవంతలఁ

చ॥ ఇంద్రుఁడొనో ♦ చంద్రుడొనో
అనంతజయంత ♦ వసంతుఁడో ॥యెం॥
అందచందమునొందఁగజేసెను ♦ సుందరబింబము
జూడగను ॥యెం॥

అనుబంధము 11 చెలులు 56

[మానికులాభరణ.]

మొ:— సంతసయాయగదేవ - సంతునిరాశకు ॥సం॥
రెం:— ఇంతిరో కన్గొనుమాపూ - బంతులకాంతిని
మూ:— ఎంతటిసుకృతమో - యీవింతకన్గొన ॥సం॥
మొ:— కోయిలవాదము - కోమల మైగన ॥సం॥
రెం:— పాయనియాకుల - పచ్చనిసొబగును ॥యిం॥
మూ:— జయజయమంచును - ఝుంకృతికన్గొన ॥సం॥
మొ:— ఇంపగుజొంపములకయా - సింపుచుకోరగ ॥సం॥
రెం:— పెంపగుగుల్మములక యా - సంపెగరీతిని ॥యిం॥
మూ:— సొంపగుగీతములచేమో - హింపగజేసెడి॥విం॥
మొ:— అక్షయమగుయిట్టిద్రా - క్షావనంబున ॥సం॥
రెం:— పక్షులగుములిటు - వృక్షాగ్రములున ॥యిం॥
మూ: యీక్షింపగమోదనుసా - క్షాత్కరించెడి॥ఎం॥

అనుబంధము 12 పే 53 సమయానుసారము.

అనుబంధము 13 పే 57 శుచిముఖి.

[శ్రీరాగము - రూపకము.]

ఘనమానీమృదుపదముల - కాంక్షింతునుమనమునహరి
వినుమామామనములయిక - గనుమాదయతోభిరబిర ॥ఘు॥
సనకసనారదతుంబుర - ప్రహ్లాదులగాచిన ॥ఘు॥
దినకరవంశజుడీవని - వినయముతో వినుతింతు

అనుబంధము 14 పే 66 శుచిముఖి.

కల్యాణి - రూపకం.

ప॥ లలనయింతటికలత యేటికే

అ॥ ఫలితముశ్రీఘ్రము నమ్ముము - పరిపక్వమునీనోము ॥ల॥

చ॥ అరమరలేకనునీపతియీ - రాతిరిచను దెంచున్ ॥ల॥
సుంద - రాంగుడిం - పొందయా - నందమునొందించు ॥ల॥

అ 15 భద్రుడు పే 64.

[సావేరి - చాపు.]

రాక్షసేశ్వరమాన్యభృత్యములకా - రమ్యముతో డనుకనుగొనుమ
యీక్షణాంబునసూపరి - త్యక్షముగానూ
అంచితంబగు - మంచిగ్గై కొన . వంచనంబుల - ద్రుం
చురీతుల ॥రా॥

సారెసారెకును - సాహిత్యనేర్పులను
మతిమతిమాడ్కగ . కోరియుకొనరకా
సరిగమపదనిస - సమ్మేళనమున ॥రా॥

అనుబంధము 16 పే 72 ప్రద్యుమ్నుడు.

[నీలాంబరి - ఆది.]

ప॥ మనసాయ దీనిజూడ - మతియేసుగూడ

అ॥ ప॥ మానసంబు తాళజాల - మన్మథేచ్ఛ తాల ॥మ॥

చ॥ అందమైనజాణ - కుందరదనబాణ
సుందరాంగి - అందమెల్ల - చూడజూడ
ముందునకుగువై వగల - మోహామొదవెనహా॥మ॥
అనుబంధము 17 పే 71 వజ్రనాభుఁడు.

కరవాలముల - మతిదీయగల - అరిజాలముల - పరి
మార్చెదల యిదెద్రుంచెదల
దారిల గోరిల జూడల బోరుల - శూరత్వముచేతల
పరివారముల - దరిగానకల - పరదూషణలల - మతి
వేగల బరిమార్చెదల - సరిదూగగల
జూడల - వేడల - ప్రోధల - నేఁడుల సంగరముల జేతుల
అనుబంధము 18 పే 80 వజ్రనాభుఁడు.

[మధ్యమావతి ఆది.]

యెంగుకొచ్చితివో - మందుఁడనీవిటు
నిందలు - బొందగదొంగను - బోలియుమందుడవై
నీవిందే తెంచియు - సుందరాంగినిల బొం
దఁగగోయు - యిందుజొచ్చినా - ముందరఁజేగ ॥యెం॥
యీపురినితరులు జేరఁగ శక్యముకాదని
యాబ్రహ్మయైనానతి యిడెకాపురుషా
నీకాపురమెయ్యది - యేపుగ దెల్పుము
అణచెదనలువను - నిన్నును

అనుబంధము 19 ప్రద్యుమ్నుఁడు పే 80.

[మధ్యమావతి - ఆ.]

ద్వారకనేలెడి కృష్ణునితనయుఁడ
వారకనీవురి - నీయానతిచే
చేరితి భద్రుఁడననఁగా దెలియుము
కోరినీదుసుత - కోర్కెలఁదీర్పక
నీదుకావరము - నీటడగింపను
పాదుకొల్పిరి - బ్రహ్మాదులెనను
నీదుప్రాణము - నీల్గఁజేసెద
కావరమేలర - యమపురికేగుమికన్

అనుబంధము 20 అందరు పే 81.

[ఆది - చక్ర]

యేలరా పలుకవునీ
చలమునుయిక భరియింపుమురా
బాలా . గోకులా - భక్తులన్వలచియిటున్ సిరులకు
పునికైన
సరసపుపలకులవినగా - పలుమరుబిలిచిన
మనంబునా - ఘనంబుగా - దలంచినే
భరింపఁగలమా - తరంబుగామీ
కరంబుసాచియు ♦ మాంగళమిడగను ॥ యే ॥

# విన్నపము.

---

మహాశయులారా!

నేను గ్రంథాదిని బ్రహ్మశ్రీ గొల్లపూడి శ్రీరామశాస్త్రి గారి పీఠికను గురించి వ్రాసితిని. కాని ప్రకృతమున వారు కార్యబాహుళ్యముచే నద్దానిని నిర్వర్తింపజాలరైరి. శీఘ్రకాలమున నద్దాని పాఠకులకందజేయుదునని నమ్ముచున్నాడ.

అత్యల్పకాలంబున నచ్చువేయుటచే ముద్రిత దోషంబులిందనేకములున్నవి. వానిని సాధ్యమైనంతవరకు నెత్తి వ్రాసినాను. క్షమింపవేడువాడ.

| పేజి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 4 | మాసంబు | మాంసంబు |
| 6 | డివు | డిపు |
| 7 | సత్రా | సత్త్రా |
| 9 | రుట్జి | రుట్టి |
| ,, | వరివc | వరివర |
| ,, | హాంగ | విహాంగ |
| 10 | వ్లభుఁడు | వల్లభుఁడు |
| ,, | అవృట్టి | అవృష్టి |
| ,, | అదట్లుండలుండ | అదట్లుండ |
| 11 | గడుసమద్భుతము | గడునద్భుతము |

# ఆంధ్రనాటకరంగము.

---

గ్రంథకర్త:—చిత్తూరు రాజకీయోన్నత పాఠశాలా ప్రథానాంధ్రోపాధ్యాయులగు బ్రహ్మశ్రీ గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు. సంస్కృతాంధ్రపండితులగు వీరు నాటకసాహిత్యమున చేసిన కృషి యనుపమానమని భాషాభిమానులకు దెలిసినవిషయమే. శ్రీయుత శాస్త్రిగారు నాటకవిషయమై వ్రాసిన గ్రంథములలో 'నాంధ్రనాటరంగి' మద్వితీయమును, అపూర్వ మును అయియున్నది. ఇందు ఆంగికము, వాచికము, ఆహార్యకము, సాత్త్వికము, అనబడు నాలుగు విధములైన అభినయములును, వానికి సంబంధించిన పాత్రోచితభాష, సంగీతము, పాటలు, పద్యములు, నాటకములు నటులు మొదలగు పెక్కువిషయములు శాస్త్రసమ్మతముగను యుక్తియుక్తముగను విపులముగ చర్చింపఁబడినవి. శైలిమిగుల మనోహరము. పాఠకుల నానందాబ్ధి నోలలాడించును. ఆంధ్రదేశములోని పండితవరుల్లైలనేకులు సదభిప్రాయములొసంగి ఈ గ్రంథముయొక్క ప్రాశస్త్యమును వెల్లడించియున్నారు.

మేలుప్రతి 1—4—0, సాదాప్రతి 1—0—0

చిరునామాలు:—మేనేజరు, విద్యావినోదినీ గ్రంథమాల,
చిత్తూరు.

వావిళ్ళ. రామస్వామిశాస్త్రులు అండుసన్సు, 292 ఎస్ప్లనేడ్
మదరాసు

## రాబోవు గ్రంథములు

[గ్రంథకర్త కా. నరసరామయ్య]

**కమలాక్షి:**—ఇయ్యది మంజరీవృత్తమున పండిత పామర హృదయరంజకమగునట్లుగా వ్రాయబడినది. వర్ణనా బాహుళ్యము.

**ఆంధ్రభోజుడు:**—ఇది యైదంకముల చారిత్రాత్మకమైన నాటకము. పద్యములు మనోహృద్యములు. పాటలు గలవు.

**మధ్యందినమార్తాండుడు:**—ఇది చరిత్రాత్మకమై హైందవరాజ్యాస్తత్యంబులఁ జూపు నవల.



For Copies apply to:—

THE MANAGER,

Victoria Jubilee Press,

*CHITTOOR.*